అతను తన ఉద్యోగం మానేస్తానన్నాడు. ఆమె ఏ మాత్రం వొప్పుకోలేదు. వొప్పుకోకపోవడం వింతగానే అనిపించింది.

అతని చిత్రంలో ప్రధానతారకి స్టూడియో మీద నిష్కారణంగా కోపం వచ్చినందున ఆ రాత్రికి షూటింగు ఆగిపోయింది. కుసుమ ఇంట్లో వుంటుంది ఆవేళ. అందుకని తొందర తొందరగా ఇంటికి వొచ్చాడు ఆమె కారులో. డ్రాయింగు గదిలో రేడియో పక్కగా కూచుని వుం ఆమె. ఆమె కుర్చీని ఆనుకుని ఒక అతను మాట్లాడు తున్నాడు. ఇం దీపాలు వెలిగించలేదు. చీకటి చీకటిగావుంది గది. ఎవరూ కబురు పంపిం కుండా లోపలికిరా రనుకొంది ఆమె. అందుకని అతను లోపలికి రాగానే కోపంగా-

"ఎవరు! ఏంచేస్తున్నావు నాగప్పన్?" అంది నౌకర్ని.

"నేనే" అన్నాడు అతను. ఆశ్చర్యపడుతో.

కుర్చీ పక్కగా నుంచున్న మనిషి దూరంగా జరిగాడు. అత లైటు వేసి ఎదురు కుర్చీలో కూచున్నాడు. కొత్తగా వచ్చిన అతను వు బిచ్చగాడిమల్లె వున్నాడు. అతని వంక అయిష్టంగా చూసి మాట్లాడకుం వెళ్ళిపోయినాడు. ఆమె మేడపైకి రాగానే.

"ఎవ రది?" అని అడిగాడు.

"బిచ్చం"

ఆమె అబద్ధం చెప్పిం దని తెలిసింది అతనికి. కాని అంతకన్న తరచవలసిన విధం తెలీక-

"ఎందుకు రానిస్తావు అట్లాంటి వాళ్ళని?" అని తన గదిలోకి వె పోయినాడు.

అతని మనసు స్తిమితంగా లేదు. ఆ మనిషిని తా నెక్కడ చూశా ననిపిస్తోంది అతనికి. అతను ఇదివరకో రెండు మూడుసార్లు వొచ్చి నట్టూ, మళ్ళీ ఒకసారి వొచ్చినట్టూ నౌకర్లు మాటల ధోరణిలో అన్నారు



అంతేగాక ఆమె బాంకుబుక్కులో ఆమె అప్పుడప్పుడు వందా, రెండు వందలూ తీస్తున్నట్లు చూశాడు. ఇదివరకు అతనితో చెప్పకుండా డబ్బు తియ్యడం ఎప్పుడూ జరగలేదు.

ఆమె నడిగితే, ఏదో ఖర్చులు వొచ్చాయి. జ్ఞాపకం లేదు అనేసింది విసుగ్గా.

ఒకరోజు అతను, ఆమె కారు దిగి హాలు లోపలికి వొచ్చేప్పటికి, ఆనాడు వొచ్చిన మనిషి, ఇంకో అతనూ అప్పటికే కూచుని సిగరెట్లు కాలుస్తో మాట్లాడుకుంటున్నారు. ఆ మనిషి ఇప్పుడు శుభ్రమైనాడు. అతను సూర్యనారాయణ. పలకరించకండా ఎట్లా వుంటాడు అతను?

"ఏమిటీ! మీరా? ఆ సాయంత్రం మిమ్మల్ని గుర్తుపట్టలేకపోయి నాను" అన్నాడు అతను.

"అవును, బళ్ళ వోడ లవుతాయి. వోడలు బళ్ళ అవుతాయి" అన్నాడు అతను, వెనక్కి కూచుని సిగరెట్ పీలుస్తో- వాళ్ళని చూసి అ వొచ్చిన వాళ్ళు అట్లానే కాలన్నా కదల్చకుండా హాయిగా పొగరు మోతుగా కూచున్నారు కొంతసేపు మాటల్లేవు. కాలే సిగరెట్టుముక్కని తివాసీ మీద పారేసి, సూర్యనారాయణ-

"కుసుమా, నీతో వొంటరిగా మాట్లాడాలి" అన్నాడు.

"టీ తీసుకొస్తారు" అంది ఆమె.

"నా కెట్లానూ పనివుంది,వెడతాను. టీ నాకు పైకి పంపించు" అని లేచాడు అతను.

ముందు ఆమెని 'కుసుమ' అనగానే అతనికి కళ్ళు తిరిగాయి. ఇప్పుడు సరిగా నుంచోలేకపోయాడు.

అమె చప్పున లేచి అతన్ని ఆపి, సూర్యనారాయణతో

"మాట్లాడేది. ఇక్కడే మాట్లాడండి. రహస్యాని కేముంది"

అంది. మొహం ఎర్ర నౌతో-

"అట్లా ఐతే సరే. నేను మొన్న స్టూడియోలో చెప్పలా రాజమాణిక్యంగారు ఈయనే."

రాజమాణిక్యంగారు ఒకసినిమా కంపెనీ float చేస్తున్నారు. దాని వివరాలు అడుగుతోంది. కుసుమ తెలుసుకున్న తరువాత.

"మీరు ఏమంటారు?" అంది అతనివేపు తిరిగి.

"ఏ విషయం?"

"ఆయన చెప్పిన వివరాల విషయం."

"కానీ చెయ్యనీ, చూద్దాం, ప్రస్తుతం ఆయన మాటలేగా ఆధారం!"

"నా మాటలు అబద్ద మంటారా? కావలిస్తే ఎల్లంగోరు రాజాగారిని—"

"అబద్ధమూ అనలేదు, నిజమూ అనలేదు. నాకు తెలియదంటున్నాను," అని—

"ఐనా నీ కెందుకు ఈ వివరా లన్నీ?" అని ఆమె నడిగాడు.

"దాంటో పదివేలు షేర్లు కొంటే, సూర్యనారాయణగారికి హీరో పాత్ర ఇస్తాట."

"సరే, ఆయనకి నమ్మకమైతే ఆ షేర్లు కొని, ఆ హీరో పాత్రని వెయ్యమను."

"ఆయనకి డబ్బేదీ? నన్ను సహాయం చెయ్యమంటున్నారు."

"అట్లాగా!"

"మే రేమంటారు?"

"పదివేలు ధర్మం చెయ్యాలని వుంటే, చెయ్యి"

"ధర్మం కింద కాదు, పెట్టుబడికింద"

"పెట్టుబడికింద ఏమీ లాభంలేదు."

"మీ కారణాలు?" అన్నాడు కోపంగా రాజమాణిక్యం.



"మీతో కాదు నేను మాట్లాడింది."

"నే నడుగుతున్నాను మిమ్మల్ని."

"కారణాలు చెప్పనవసరంలేదు"

"అయినా ఒక్క కారణం చెబుదురూ?"

"మీ మాటలు వింటే చాలు, మీవంక చూస్తే చాలు, వేరే కారణం అక్కర్లేదు."

"ఆఁ" అనిలేచాడు మీదికి వొచ్చేట్టు రాజమాణిక్యం.

"కూచోండి కూచోండి" అంది ఆమె.

టీ వొచ్చింది. తాగకుండానే లేచి వెళ్ళిపోయినాడు.

అతను పెద్ద ఆలోచనలో పడ్డాడు.

ఆమె అపాయంలోకి నడుస్తోంది. తనకి తెలియకుండానే వీళ్ళకి తనమీద చనువు నిచ్చుకుంది. త నేం చెయ్యాలి? ఆమె తనకు అంత అధికారం ఇస్తేనా? అంతవరకు తనేం అధికారం తీసుకోలేదు. అవసరం రాలేదు. ఇప్పుడు తాను కల్పించుకుని ఆమెని అదిలించి మేల్కొలపాలా? కాని ఆమెని ఒత్తిడి చేస్తే ఎంతవరకు ఆమె సహిస్తుందో! అనుమానం అతనికి. తన కెందుకని తప్పుకుంటే? కాని నిస్సహాయంగా ఆమెని వొదలడం అన్యాయం. అదిగాక ఆమె తన స్త్రీ! తనని అన్నిటికీ నమ్మిన స్త్రీ.

అరగంటకి ఆమె పైకి వొచ్చి అతని పక్కలో ముద్దుగా కూచుని అసహజంగా నవ్వుతెచ్చుకుంటో—

"మరీ పెంకివా రౌతున్నా రేం? అంత కోపమూ! వాళ్లేం చేశారు?"

"ఛీ వెధవలు. వాళ్ళని భరించలేను. ఐనా నీ కేం పనివాళ్ళతో?"

"అదేమిటి? ఏదో కష్టంలో వుండి సహాయంకోసం వొస్తే ఇంతలో ఏం మునిగిపోయింది? నేను కనుక్కున్నానుగా, ఆ రాజమాణిక్యం నమ్మకస్తుడే. నాకు కూడా చాలా నమ్మకం కుదిరింది. ఆ మాత్రం పరులకి సహాయం చెయ్యకుండా ఎట్లా బతకగలం?

"చెయ్యి, నేను వొద్దన్నానా?"

"వొద్దనకపోతేనేం? చాలా అయిష్టంగా వున్నారు."

"వుండను మరి! సరదాకోసం బాంకునోట్లతో వంట చేస్తానంటే, ఇష్టం చూపుతానా మరి?"

"పోనీ లెండి, ఏదో నా సరదాకి ఆ డబ్బు ఇవ్వనీండి. ఇంక మనసులో ఏమీ వుంచుకోకండి."

"సరే కాని, ఆ డబ్బుతో వాళ్ళ ముఖారవిందాలు నాకు కనపడడం మానుకుంటాయా?"

"ఆ, చెపుతాను."
"అంతే కాదు. నువ్వూ వొదుల్చుకోవాలి."
"వాళ్ళు వస్తే నే నేం చెయ్యను?"
"నాకు వొదులు,"
"మరి వాళ్ళకి కోపం తెప్పించడం నా కిష్టంలేదు."
"నాకు కోపం తెప్పించడం?"
"ఏమిటా మాటలు? మీకూ వాళ్ళకీ సాపత్య మేమిటి?"
"నాకు లేదులే నీకూ వాళ్ళకి సంబంధ మేమిటి?"
"ఏముందీ? ధనం కలవాళ్ళకీ, లేనివాళ్ళకీ వుండే సంబంధం."
"లక్ష లున్నారు డబ్బులేని వాళ్ళు, కుంటివాళ్లు, గుడ్డివాళ్ళు"

"వాళ్ళకిచ్చేది వాళ్ళకి ఇస్తోనే వున్నాంగా. ఇంక మాట్లాడకండి" అని ముద్దు పెట్టుకుని వెళ్ళిపోయింది.

ఆమె బాంకి బుక్కులో పదివేలు తరుగు.

పదిరోజు లయిందో లేదో మళ్ళీ హాజరు సూర్యనారాయణ. ఈ సారి మంచి విలువగల సర్జి సూటులో. హాటు. నోట్లో చుట్ట. వొచ్చి చాలా పాతమిత్రుడి మల్లే వాళ్ళిద్దరితోనూ కబుర్లు చెపుతున్నాడు. తను వెళ్ళాక, ఏమిటి మళ్ళీ వచ్చాడంటే—



"ఏమిటి మరీ అంత క్రూరంగా మాట్లాడతారు? పాపం ఏదో కొంచెం పెద్దమనిషితో కలిసి బాగుపడదామనే మనిషికి అంతమాత్రం సహాయం చెయ్యకపోతే ఎట్లా? ఎందుకంత కోపం అతనిమీద? ఏం నీచుడా? అల్లరి చేశాడా? మరీ ఎవరినీ చూడకండా, స్నేహంచెయ్యకుండా మనం వొంటరిగా బతకాలనా మీ ఇష్టం?" అని ఉపన్యాసం ప్రారంభించింది.

రెండురోజులకో మాటూ, రోజు విడిచి రోజు సూర్యనారాయణ వొస్తూనే వున్నాడు. ముందు వాళ్ళని డిన్నరుకి పిలిచారు బసోటాలో. తాను విస్కీ తాగి, అతన్ని కూడా తాగమని బలవంతం చేశాడు. తాగ నంటే హాస్యం చేశాడు. తరవాత వాళ్ళింటోనే అప్పుడప్పుడు భోజనం చేస్తున్నాడు. వీళ్ళిద్దరూ బైలుదేరితే అతను మూడో వాడౌతున్నాడు. క్రమంగా అతని తాగుడు హెచ్చుతోందనీ తెలుస్తోంది. కాని, ఏ మాత్రమూ ఇతరులకి ఇబ్బంది కల్గజెయ్యడు. జాగ్రత్తగా మసులుతాడు.

ఆ సూర్యనారాయణ కంపెనీని ఆమె ఎన్‌జాయ్ చేస్తోంది. తన నెందుకు అత నంటె పడడు? అని ప్రశ్నించుకున్నాడు అతను. ఆమె మీద ఏదో కొంత స్వతంత్ర మున్నట్టు అతను ప్రవర్తిస్తుండడం వల్ల నేమో! తనకు తెలీని వ్యవహారం ఏదో వుంది.

నెలరోజుల్లో వాళ్ళ ఇల్లు మామూలు నివాసమయింది సూర్యనారాయణకి. అతనికి ఏమి చెయ్యాలో తెలీలేదు. వాళ్ళు మేడమీద చేసే రిహార్సల్స్‌లో కూడా జోక్యం కలుగచేసుకుంటున్నాడు సూర్యనారాయణ. ఆమె నటించిన చిత్రాలలో లోపాలు చూపి, తన సలహాకింద అవన్నీ సరి దిద్దుతానని చెప్పాడు.

ఓరాత్రి అతను ఆమెతో పెద్ద తగాదా ప్రారంభించాడు.

"మీ కంత ఇష్టం లేకపోవడానికి కారణం కనపడదు. పోనీ మీ కిష్టంలేదు గనుక ఆయన్ని పొమ్మందా మంటే, ఎట్లా పొమ్మనాలో తెలీటం లేదు నాకు."

"మాట్లాడకు నువ్వు అతనితో."

"ఎట్లా, పలకరించే మనిషితో మాట్లాడకపోవడం?"

"నేను పొమ్మంటాను."

"అదేగా. వొద్దనేది నేను."

"సరేలే, అత నిట్లా వొస్తోవుంటే, నేనిక్కడ ఉండడం కష్ట మౌతుంది."

దాంతో ఆమె ఏడ్చింది.

"నేను నీ భార్యని కాదుగనకనేకదా, అంత సులభంగా, ఉండను పోతాను, అనగలిగావు?" అని.

"నా భార్యవే ఐతే ఇంతవాదన ఎందుకు? నిన్ను వాడి ముందే రెండు తన్ని, వాణ్ని అవతలకి నడవ మందును."

"అంతేగా మొగవాళ్ళకి చాతనైనపని. తన్నండి పోనీ, మీ కంఠ సరదా ఐతే."

"తన్నను. అంతకన్న మంచిపని. నిన్ను పెళ్ళి చేసుకుంటాను."

"నన్నా? మీకు భార్య ఉందిగా."

"ఉంటేనేం?"

"నే నంత పాతకానికి వొడికట్టుకోను. పాపం. ఆమె ఏం చేసిం దని, నేను ఆమెకి ద్రోహం చేయడం?"

ఆడవాళ్ళతో ఏ మొగవాడు వాదించ గలడు? అందుకనే తంతాడు.

"ఇప్పుడు నువ్వు చేసే దేమిటి?"

"నే నేం చేశాను? మీ భార్యని రావడానికి వీల్లే దన్నానా? రేపు పిలి పించండి."

"ఈ పరిస్థితుల్లో ఎందుకు ఉంటుంది?"



"దానికి నే నేం చెయ్యను?"

"నే నేమన్నా ఆమె రావాలని అన్నానా?"

అంతటితో విసుగెత్తి ఎక్కడ అసలు ప్రారంభించారో అక్కడ నిడిచి పూరుకున్నారు.

వాళ్ళకి సూర్యనారాయణ పర్మనెంటు మిత్రుడైనా డని నిశ్చయ మయింది. అదిగాక ప్రతి రోజూ అతను ఎక్కువ స్థలం ఆక్రమించు కుంటున్నాడు. ఏం చెయ్యాలి తను? అతను అసలు రాకూడదని పట్టు పట్టాలి. పడితే ఎటు మొగ్గుతుందో ముల్లు! ఎటు మొగ్గనీ ప్రస్తుత స్థితి మాత్రం దుర్భర మనిపించింది అతనికి. భవిష్యత్తు కూడా తన ఉద్వాసనకే మొగ్గు చూపు తోంది. కాని తొందర పడకూడదని సుమతీ శతకం పద్యం చదువుకున్నాడు ఓసారి. కాని—

కదలని వాళ్ళని కాలమే కదలిస్తుంది.

ప్రతి వ్యవహారంలోనూ అతను ఏం చెప్పినా సూర్యనారాయణగారు ఇట్లా అంటున్నారు అని అంటుంది ఆమె. సూర్యనారాయణ సలహా ఎప్పుడూ తన సలహాకి సరిగా వ్యతిరేకం. చివరికి తాను చెప్పిన మార్గాన్నే వెడుతుంది ఆమె. కాని అది తన ఘనతవల్ల కాక సూర్యనారాయణ సలహా అనర్థదాయకమని ఆమెకి తెలీడంవల్ల నేమోననిపించింది అతనికి.

ఆ చివరి రాత్రి డ్రాయింగు రూములో ఆమే, సూర్యనారాయణ చాలా ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుని నవ్వుకుంటున్నారు. అరగంటనుంచి తనని పలకరించలేదు. లేచి పోదామా అనుకుంటూ ఉండగా వాళ్ళే లేచారు—

"స్థానం వారి విప్రనారాయణకు వెడదాం" అని.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయినారు భగ్గుమంది అతని ఆగ్రహం.

రెండు నిమిషాల్లో ఆమె వెనక్కు వొచ్చి—

'రారేం?' అంది.

"ఎక్కడికి?"

"ఏం విచిత్రం? వినటంలేదా మీరు?"

"విన్నాను. కాని వొస్తాననలేదే."

ఈలోపల బైటనించి అతను 'కుసుమా' అని కేకలు వేస్తున్నాడు.

"అయితే, రారా?"

"రాను."

"ఏం చేస్తారు వొంటరిగా? రద్దురూ!"

"నేను రాను...."

'కుసుమా' అని కేక.

"సరే మీ ఇష్టం"

అని వెళ్ళిపోయింది.

అంతే, పావు గంటలో తన బట్టలు సర్దుకుని రిక్షాలో రైలుస్టేషన్‌కి వెళ్ళాడు—వాళ్ళ సొంత వూరికి ప్రయాణం.

## 5

పెద్ద సౌధం, దీపాలు, కారు, నౌకర్లు, మంచి వంటలు — ఇవన్నీ వొక్కసారిగా వొదిలి, పల్లెటూరిలో పడిపోయిన ఇంటో ముసలి తండ్రి దగ్గర చేరాడు అతను. తడుముకున్నట్టు ఉందిగాని చాలా శాంతిగా వుంది. ఆమెమీద పెద్ద ప్రేమ అతనికి ఎప్పుడూలేదు. అందు కని ఏమీ బాధపడ లేదు. అతని వొంతు నాలు గెకరాల పొలం ఉంది ఆ ఊళ్లో. దాని సంగతే మరిచిపోయినాడు. తన పొలమూ, తన తండ్రి పొలమూ సేద్యం ప్రారంభించాడు. ఇంటి దగ్గిర తన వితంతువు అక్క లక్షణంగా వొండి పెడుతోంది. కాలం హాయిగా గడిచిపోయింది.



అతని భార్యని తీసుకురావడానికి బంధువులు ప్రయత్నించారుగాని ఆమె రానంది. సినిమాలూ, పత్రికలూ ఏమీ లేవు ఆ పల్లెటూళ్ళో. క్రమంగా ఆ వూరివాళ్ళందరూ అతన్ని తమరిలో ఒకరిగా తీసుకున్నారు. దంపుడు బియ్యం అన్నం, కందిపప్పు, గేదెనెయ్యి, పెరుగూ-బాగా బలి శాడు అతను. అవసర మైనప్పుడు పొలంలో స్త్రీలకి ఏమీ తక్కువ లేదు. ఆ రోజుల శాంతి ఎన్నడూ ఎరగడు జీవితంలో అతను. ఇప్పుడు చాలా ధనవంతుడు. ఏ చింతలూ లేవు అతనికి. కాని ఎక్కడో శాంతి తక్కువ. బుద్ధి ఉన్నవాడు ఎవరైనా, నాలుగు ఎకరాల పొలం ఉంటే దాన్ని వొదిలి ఇంకోపని తలపెట్టడు, పట్టణపు బొమ్మల వెంట ఎన్నడూ తిరగడు, అనుకున్నాడు

సంవత్సరన్నర గడిచింది.

ఒక మధ్యాహ్నం ఆమె ఇదివరకుకన్న పెద్దకారులో వొచ్చింది. అకస్మాత్తుగా ఆ పల్లెటూరికి. సరాసరి మద్రాసు నుంచి—పెట్రోలు రేషన్ రోజుల్లో. అతను పొలంలో వున్నాడు కుప్పలు నూర్పిస్తో. అక్కడికి నడిచివొచ్చింది. ఆమె వెంట పెద్ద గుంపు. అప్పటికి ఆమెని చాలా మరిచిపోయినాడు అతను.

"ఏమి టిది?"

"పదండి"

"ఎక్కడికి?"

"ఎక్కడికి? మద్రాసు."

"ఏం సంగతి?"

"సంగతీ లేదు ఏం లేదు, బైలుదేరండి."

"నేను రాను."

"వొస్తేనేగాని నేను పోను."

"వుండు. మళ్ళీవస్తాను. యీ దిబ్బమీద కూచో, నేను వొచ్చిందాకా."

అని పొలంలోకి కూలీల దగ్గరికి వెళ్ళిపోయినాడు. అతను తిరిగి వొచ్చేప్పటికి సూర్యుడు అస్తమించాడు. మాఘమాసపు మధురమైన గాలి వీస్తోంది, వరిమోడులమీదనించి. ఆమాసపు సాయంత్రాల అందం, అల్లరి చేసి నిద్రకి కన్ను మూసుకునే అందమైన పాపాయిల కాళ్ళ కింద మాత్రమే చూడగలం. అతను చమవొంటితో వొచ్చి కూచోగానే-

"ఏం బతుకు ఇది?" అంది.

"చుట్టూ చూడు."

ఎదురుగా శుక్రుడు ధగ ధగ మంటున్నాడు.

"సరే లేండి. ఆ ఇల్లు ఆ మనుషులు!"

"సినిమావాళ్ళకన్న అన్యాయమూ?"

"కాని మీ రెట్లా వున్నారు ఇట్లా?"

"చాలా హాయిగా"

"మీరు రావాలి"

"ఎన్నటికీ రాను"

"నా మీద కోపం పోలేదా మీకు?"

"మళ్ళీ రాదలుచుకుంటే ఆలోచించాలి. కాని నా కెందుకు? కోపమూ లేదు, ఏమీ లేదు."

"మీరు రానిది నేను పోను."

"వుండమంటినిగా!"

"నా పనులో?"

"వెళ్లూ!"

"వెళ్ళను, మీ ఇంటోనే వుంటాను."

"ఏం తింటావు? కందిపప్పు, తోట కూరా...."



"ఓ తింటాను"

"ఇంకేం? వుండు."

"ఎంతకాలం?"

"సూర్యనారాయణ రానంతకాలం"

"అదీ, అట్లారండి. అక్కడవుంది మీకోప మంతా"

ఆమెవంక చూస్తున్నాడు. ఆమెకి అందం వొస్తోంది, పరిస్థితుల మహిమ. నీతో చదువుకుని, నీచేత తన్నులు తిన్న కుంక—వాడు ఓ డాక్టరైతే ఆ కాపిని ఏళ్ళల్లో ఆ బాధ్యతా, ఆ జ్ఞానమూ! అతన్ని ఎంత మార్చేస్తాయి! అకస్మాత్తుగా ధనం వొస్తే ఆరు నెలల్లో మనిషికి ఖరానా షావుకారు బరువు వొస్తుంది. అందువల్లనే ధనానికీ, విద్యకీ, అధికారానికి అంత విలువ ప్రపంచంలో. అవి వుండడమనేదేకాదు, అవి మనిషికి ఇచ్చే పాలిష్, నాగరికతవల్ల.

"వున్నాడా?"

"లేడు. అప్పుడే పోయినాడు."

"ఎందుకు పోయినాడో పాపం."

"పోలీసుల్ని పిలిపిస్తానని బెదిరిస్తే."

"ఎందుకు అంత ఘోరమైనపని చేశావు?"

"తాగుడు ఎక్కువైతే...."

"ఓ నువ్వేం చేస్తున్నావు?"

"మీకు తెలీనట్టు"

"నా కెట్లా తెలుస్తుంది?"

"అదేమిటి! పత్రిక లా?"

"మావూరు ఏవీ రావు"

"బావుంది. మామూలు పనే. ఎక్కడా పూపి రాట్టంలేదు. సినిమా పుస్తకాలు తెచ్చాను. ఈనెలవి. కారులో వున్నాయి. చూపిస్తాను."

"మరి ఇప్పుడు తీరుబడి ఎట్లా అయింది?"

నవ్వింది.

"మూడు రోజుల్లో మద్రాసులో వుండకపోతే అరడజను డైరెక్టర్లు పరుగెత్తుకుని వాస్తారు ఈవూరు. మిమ్మల్నీ నన్నూ కట్టిపడేసి తీసుకు పోతారు."

"న న్నెందుకు?"

"మీరు లేంది నేను రానంటే."

"సరేలే, ముందు పద. రాత్రికి భోజనం చెప్పి చేయించాలి నీకోసం."

అని మాట్లాడుకుంటో పొలాల్లోనుంచి నడిచి ఒచ్చారు. ఎత్తు మడమల చెప్పులతో ఆమె మెరకపల్లాలలో జారుతూవుంటే అతను ఆమెని పట్టుకుంటో, వాళ్ళ వెనక గుంపు.

భోజనం ఆమెకి వేరే వొడ్డించారు కులభేధం ప్రకారం. కాని పడకలకి కులభేధం పాటించరు, ఎంత శ్రోత్రియులూ. దృష్టిదోషంలేదు, ఎంగిలిదోషం లేదు-ఏశాస్త్రంలోనూ, ఆ విషయంలో.

రాత్రి నిద్రలో అతను ఏ నందనవనాల్లోనో తేలిపోతున్నాడు, గొప్ప సెంటు సౌరభాల్లో. పదిమంది అప్సరసలు అతన్ని కావలించుకుని, ఒక్కసారిగా పదిమందీ అతన్ని మానభంగం చెయ్యాలని ఆత్రుతపడుతున్నారు. సగం తెలివి వొచ్చి, పది దేవతాపాత్రలు ధరించిన ఆమె, ఈలోకం వాస్తవంలో కల్పిస్తున్న ఇంద్రజాలమని సగం తెలుసుకుని, ఆ అమృతానుభవం ఎక్కడ ఈలోకంమల్లే సాధారణమౌతుందో నని ఆలోకంలోకి వెళ్ళిపోయినాడు.

ఆరాత్రే నిశ్చయమయింది అతనికి, ఆమెతో వెళ్ళక ఎట్లానూ తప్పదని.



తెల్లారకట్ట; కిటికీ పక్కన విచ్చిన పారిజాతపు సువాసనల్లో కోయిల అరుపుల్లో. కిటికీలోకి తొంగి చూసే చందమామ వెలుగులో, ఆమె అతని రొమ్ముమీద నించి తలని తప్పించుకుని, మర్యాదగా తన పక్కమీదికి వెళ్ళిపోయింది.

ఆ వూళ్ళో పొద్దున్న కాఫీ లేదు. ఆమెకి తలనొప్పి—పొరుగూరికి మనిషిని పంపారు కాఫీపొడరుకోసం. ఆమె మద్రాసు పోదామని పోరు.

రాత్రి ఆమె పెదవుల మధ్య ముద్దుమాటలు రహస్యాలూ పలికిన, అతని నిరాకరణలో నిన్న సాయంత్రపు బల మేదీ?

"నా రాణీ. నా కోయిలా. నా లిల్లీ పుష్పం," అని అతనూ.

"నా రాజా, నా దున్నపోతూ, నా ముళ్ళకంపా" అని ఆమె.

అంటో అర్ధరాత్రి డ్యూయెట్ పాడుకున్న తరవాత, తెల్లారి ఎట్లా కఠినంగా మొహం తిప్పుకోగలడు? అత నేం విశ్వామిత్రుడా, దుష్యంతుడా ?

కాని రాత్రి అమరత్వంలోంచి, స్వప్నలోకంనించి, వాస్తవంలోకి కళ్ళుతెరిచాడు. స్వప్నంలోంచి వాస్తవంలోకా, వాస్తవంలోంచి స్వప్నంలోకా, లేక సుందర స్వప్నంలోంచి నిస్సారస్వప్నంలోకా! అది మహాఋషులు తేల్చవలసిన విషయం.

మొత్తానికి వాళ్ళ మామూలు దుష్టప్రపంచంలో, పాతజ్ఞాపకాల రోషాలూ, ముందు జీవితం మీద భయాలూ అలుముకున్నాయి అతని మనసుని.

"నేను వొచ్చి ఏం చెయ్యను? మళ్ళీ ఉద్యోగం ఇప్పిస్తావా?"

"కాదు, మీరు పత్రికలు చదవకపోవడం అనర్థ మొచ్చింది. నేనే ప్రొడ్యుసర్ కాబోతున్నాను."

"ఐతే?"

"మీరు డైరెక్టరు నా చిత్రానికి."

"నేనా? నాకేం చాతనవుతుంది?"

"అదేమిటి? అన్ని చిత్రాలు అంత విజయవంతంగా తీసి ఈ నాడిట్ల అంటున్నా రేమిటి?"

"సరేలే. నిజం మాట్లాడు."

"నిజమే. ఇప్పుడు చిత్రాలు తీస్తున్న డైరెక్టర్లకి ఏం చాతనవును? మీ కంతమాత్రం చాతకాకపోతుందా?"

"ఎందుకు నన్ను తీసుకుపోయి నువ్వు పైకి నెట్టడం? ఏమీ ఉప యోగం, అర్హతా, అవసరం లేకుండా నేను వొచ్చి తక్కిన వేషాలమల్లేనే ఓ డైరెక్టరు వేషం వెయ్యడం? నువ్విచ్చిన ఉద్యోగం నీదయమీద ఆధార పడ్డం? మళ్ళీ నే నా ఇరుకులో పడతలుచుకోలేదు."

"కాని నా సంగ తేమిటి?"

"నీ సంగ తేమిటి?"

"మీకు తెలీదా? మీరు నన్ను వొదిలి వెళ్ళిన చోటనే ఉన్నానన్న మాట. కొత్తపార్టు నాకు అర్థం కావటం లేదన్న మాట. మీ అవసరం తెలిసిందా?"

"అందువల్లనా ఈ ప్రేమనటన నా మీద?"

ఆమె కన్నీళ్ళు పెట్టుకొని లేచిపోయింది. అతను వెంటపడి,

"నే నన్నదాంట్లో త ప్పేముంది?" అని అడిగాడు.

ఈ విషయాలు వుత్త వాదనతో అర్థ మయ్యేవి కావు. నాకు మీకైన అవసరం ఎట్లాంటిదో గుర్తించకపోతే నే నింక ఏం చెప్పి మిమ్మల్ని నమ్మించ గలను? నా అవసరాన్నిబట్టి మీ మీద ప్రేమచూపుతున్నానంటే నే నేం జవాబు చెప్పగలను? మీ హృదయానికి నిజం తెలియాలిగాని!"

ఆ సంగతి లోపల ఎక్కడో అతనికీ తెలుసు.



"మరి మళ్ళీ సూర్యనారాయణలు తటస్థించ రని నమ్మకమేమిటి?"

"సూర్యనారాయణ ఒక్కడే గనక."

"ఈ లోకంలో అట్లాంటి వాళ్ళకి తక్కువేముంది!"

"లేదు. కాని నాకు జీవితంలో చిన్నప్పుడు నాకు తాళికట్టిన మొగుడు ఒక్కడే గనక. అతనే సూర్యనారాయణ."

ఆగిపోయినాడు అతను.

"పాతివ్రత్య మనండి. దుష్టుడే! తోసుకు వొచ్చాడు. మీచేత తన్నించడం తప్ప గత్యంతరం లేదు, అతన్ని వొదుల్చుకోవాలంటే భర్త అనే పదంమీది గౌరవ మనండి, స్కాండల్ అంటే భయమనండి. ఏం చెయ్య లేక పోయినాను. మీ మీదకూడా కొంత కోపమే ననుకోండి, అంత మాత్రం కొంచెం నొపికా, నామీద నమ్మకం మీ కెందుకు లేకపోవాలని! మీరు అతన్ని తంతే నా రహస్యం బైటపడుతుం దనీ."

"నాతో రహస్యం చెప్పేసివుండ కూడదూ?"

"ఆహా! ఏం నంగనాచిలాగు మాట్లాడతారండీ! చెపితే మా ఇద్దర్ని ఆశీర్వదించి రై లెక్కరూ?"

పూర్తిగా లొంగిపోయినాడు అతను.

మర్నాడు ఆమెతో కారెక్కాడు.

తండ్రీ అక్కా ఒక్క మాటనలేదు. అక్కడే ప్రేమగల బంధువుల ఆధిక్యం. ఏకష్టసమయంలో నైనా వాళ్ళ అండను చేరవొచ్చు. మళ్ళీ ఏ ప్రశ్నా లేకుండా వాళ్ళని వొదిలిపోవొచ్చు. అందుకనే తల్లిదండ్రుల ప్రేమకి అంత ఆధిక్యం ఇస్తారు.

తక్కిన కథ మీ అందరికీ బాగా విదితం. మమ్మల్ని మర్యాద చెయ్యవలసిన అవస్థపట్టింది పాపం మీకు. మీ ఇళ్ళకు మమ్మల్ని పిలవాలి మీరు. పిలిచినా పిలవకపోయినా మా ఇంటికి రావడం తప్పలేదు మీకు. మా ఇంటికి వొచ్చి మీరు మమ్మల్ని గురించి ఏం మాట్లాడుకుంటారో తెలుసు మాకు. ఎట్లాతెలుసునంటే, మావంటి వొదులు దంపతుల్ని గురించి

మీ రేం మాట్లాడుతో వుంటారో వింటోనే వున్నాంగా? పెళ్ళి అయిందం ఇంక వాళ్ళ సంగతి మాట్లాడటానికి ఏమీ వుండదు. వాళ్ళ ఏ బూ ప్రమేయమూ లేకుండా ఏదో పవిత్రంగా ధర్మ సంస్థాపనలో లోకసం హం చేసుకుంటూ వుంటారు.

ఆ పనినే ఏదో చాలా లంపటంగా నీచంగా, పసువులమల్లే చేస్తా పెళ్ళికాని వాళ్ళు. మమ్మల్ని వెక్కిరించునే సంతోషం మీనించి తీసివెయ్య డం మాకు ఏమీ సంతోషంగా లే దనుకోండి. ఎదటవున్న వాళ్ళల్లో చా మంది ఒకే మనిషితో ఒకే పక్కమీద నిద్రపోవటంలేదన్న సంగతి పవిత్ర వివాహ సమయంలో మనం ఎవరం దాచుకో నక్కర్లేదు.

ఇంతకీ బిల్లు ప్రకారం, నా భార్యనాతో కాపురం నిరాకరించి కనక విడాకు లివ్వ వొచ్చు. కాని సూర్యనారాయణకే అట్లాంటి నోటీ పెడితే ఒక్కగంతున దూకుతాడు ఆమెవాళ్ళో. అందుకని అతన్ని ఇం పద్దుకిందికి తీసుకొచ్చారు. అతన్ని మా ఇంటికి మిత్రుడికింద ఆహ్వా చాం. అతనికి అడక్కుండానే చెక్కులుఇచ్చాము అతి ప్రేమతో. పర్య సానం? మితిమీరిన తాగుడు. ఆ మూలంగా అతనికి విడాకులివ్వడం చా సులభ మయింది. ఆ మహానుభావుడు కోర్టులో పలికిన బూతులు పత్రిక పతులు పూర్తిగా సూచించారు.

ఎందుకు చెప్పాను ఈ కథ?

మీలో అనేక మందికి దీంట్లో ఏదో ఓభాగమన్నా మార్గదర్శకం వుండకపోతుందా అని.

ఇంత క్షమతో మీరు నా కథ విన్నందుకు వందనాలు.

ఈ కథనించి నే నో విషయం తెలుసుకున్నాను. ఆ, ఒక నిమిషం వోపిక పట్టండి, మీకోసం పక్కగదిలో ఐస్క్రీం, ఫలహారా తయారుగా వుంచుతున్నారు. ఆసంతోషంలో ఇది వినండి. వెళ్ళిపోవచ్చు నేను చిత్రాలకి విజయవంతుడైన దర్శకుణ్ణి ఐనానంటే, లోకంలో మనిషైనా దర్శకుడు కావొచ్చునని వేరుగా రూఢిచెయ్యనక్కర్లేదు. కా



ప్రతిమనిషీ కాలేడు. ఎందుకంటే నాకూ, చాలామంది తక్కిన వాళ్ళకి ఒక్క భేద ముంది. అది నన్ను ప్రేమించే స్త్రీ నా కిచ్చిన ఆత్మబలం, విశ్వాసం! ప్రేమగల స్త్రీలు ఈ కాలంలో పురుషుడిలో వుండే లోపాల్ని జాగ్రత్తగా వెతికి, అతను ఎందుకూ అసమర్థుడనీ, ఒకవేళ అతను ఏ ఉద్యోగంలోనో, కళలోనో కొంత ఆధిక్యాన్ని సంపాయిస్తే, అది ప్రజల మూర్ఖత్వంవల్లనో, అతను చేస్తున్న మోసంవల్లనో తటస్థించిందని వాదించి, తమ భర్తల ధైర్య స్థైర్యాన్ని గుంజి, చంపడంలో తమ ప్రేమాధిక్యాన్ని నిరూపణ చేసుకుంటున్నారు. కాని ఏ అదృష్టంవల్లనో, ఈ కుసుమ నాలో విశ్వాసాన్ని ప్రతిష్టించి, నన్ను రగిల్చి, సాధారణమైన మానవుణ్ణి ఒక ప్రతిభావంతుణ్ణి చేసింది. అదీ భేదం.

ఇక మనం లేవవచ్చు.

★

# దెయ్యమేనా?

ఆ నాటకం, చావని ముసలి పీనిగమల్లే. యీడ్చుకుని యీడ్చుకుని సమాప్తి చెందేప్పటికి సరిగ్గా నాలుగయింది. మూడణాలు చెల్లించడము వల్ల—ఆ విలువ పూర్తిగా గ్రహించందే బయటికి రాబుద్ధి బుట్టలేదు.

"ఇప్పు డేం నిద్ర? పదండి క్రిష్ణ ఒడ్డుకి స్నానంచేసి హోటలికి చేరుకుందాము" అన్నాడు ఒకడు.

రామమోహన లైబ్రరీ దగ్గిర బ్రిడ్జిదాటి కాలవకి నదికి మధ్య యెత్తుగా ఉన్న గట్టునే నడుస్తున్నాము. ఓ చేతిపక్క అన్ని కష్టాలూ మరిచి నిద్రపోతున్న పట్టణమూ, రెండో చేతివేపు వెన్నెట్లో నిద్రపోతున్న ఇసికా, దూరంగా సీతానగరం కొండల ప్రక్కన నిద్రపోతున్న నది పాములాగు అల్లుకుని పడుకుంది. గట్టుకిందవున్న తోటల్లోంచి అవ్యక్తమయిన పరిమళాలు-అప్పుడే వికసించే పువ్వులోంచిగావును- వొస్తున్నాయి. అప్పుడప్పు డో కోడికూత, మా అడుగుల చప్పుళ్ళు విన్న కుక్క అరుపు....మాలో ఒకడు వెనక్కి తిరిగి "ఆ మంట ఏమిటి?" అన్నాడు.

"శవం"

"ఒరే దెయ్యాలు-దెయ్యాలు అంటారు. ఒకటీ కనబడవేం ?"

"అన్నట్టు నేను దెయ్యం కథ చెపుతాను వినండి. నేను స్వయంగా ఎరిగిన విషయం."

"వొద్దుగాని, నాకు దెయ్యాలే కనబడితె-కామ దెయ్యాలు, అవి కనబడితే బావుండును."

"ఎందుకు?"

"ఆ తమాషా, ఆ అనుభవం ఎట్లా ఉంటుందోనని."

"కాని వాస్తవం కాని ఆ మాయ మనుషులతో ఏం సౌఖ్యం?"

"ఈ మనుషులు మాత్రం నిజమా? వీళ్ళూ కల్పనలేనేమో!"

"అయితే లోకమే అబద్ధం."

"ఆ ఆడదెయ్యాలు మనిషిని రక్తమాంసాలు పీల్చేస్తాయట."

"ఈ నిజమైన ఆడవాళ్ళు అంతకన్నాను!" అన్నాడు సినిక్.

కొంతసేపటి కిందట మమ్మల్ని కలుసుకుని ఒక పల్లెటూరి కుర్రాడు ఆ దోవనే నడుస్తున్నాడు. అతను "అయ్యా! రెండు నెలల కిందట ఒక సంగతి జరిగింది. చెబుతాను, వింటారా? నిజమయిన సంగతి." అన్నాడు.



"చెప్పు."

"మాది యీ జిల్లా కాదు. ఈవేపు వాణ్ణి అయితే మీతో యీ కథ చెప్పనే చెప్పను. కారణం చివరికి మీకే తెలుస్తుంది. మాదొక పల్లెటూరు. రెండుమైళ్ళ దూరంలో యింకొక పల్లె ఉంది. దాంటోనండీ, ఇంకో వూరు మునసబు ఒక బ్రాహ్మణామెను వుంచాడు. నే నాయన కింద కమతగాణ్ణి. ఆయన చాలా పలుకుబడిగలవాడు. వోట్లకూ - దానికీ గొప్ప గొప్ప వారు వొస్తారు ఆయన యింటికి. ఈ వ్యవహారం పైకి తెలియడం ఆయన కిష్టంలేదు. వారానికి రెండుసార్లు బాగా చీకటి అయింతరవాత వొస్తాడు. తెల్లవారకముందే వెళ్ళిపోతాడు. ఆయన వూరినుంచి మా పల్లెకు నేను ఆమె యింటి ముందునించే వెళ్ళాలి. వొచ్చే రోజున ఆమె స్నానానికి నీళ్ళూ, భోజనమూ, గంధమూ, పూలూ, అన్నీ సిద్ధంగా వుంచుతుంది. అందుకని నా చేత ఆమెకు కబురు పంపేవాడు, ఎప్పుడన్నా ఆయనకు రావడానికి వీలులేకపోతే :

ప్రతిరోజూ నేను ఆ దోవనే వెడతాను గనక నాకోసం ఎదురు చూడడం ఆమెకు మామూలు అయింది.

"మునసబుగారు ఈ రోజు రారు" అని నేను చెపితే,

"ఇట్లా చూడు - ఇవన్నీ యేం చేసుకోను?" అని నన్నడుగుతుంది.

ఆమె నిరాశ చూసినప్పుడు నాకు దిగులు వేసేది.

"ఏం చెయ్యను, యీ భోజనమంతా ? నువ్వయినా తిని వెళ్లు", అంటుంది.

ఓ రోజు ఆమె పుట్టినరోజు పండగ. మునసబుగా రామెకి నేల మంచు పట్టుచీరె పంపారు.

"ఈ సాయంత్రం తప్పకుండా అయ్యగార్ని రమ్మను" అంది. నేను సాయంత్రం తిరిగి వెళ్ళి "మంత్రిగారు అవసరంగా కబురు పంపితే

పట్టం వెళ్ళా"రని చెపితే, ఆమె మొహం చూడవలసిందే. తలంటి పోసుకుని, ఆమె పెద్ద జుట్టు వేళ్ళాడేసుకొని దొడ్డి గుమ్మంలో నుంచుంది. దొడ్లో బీరపువ్వులూ, చంద్రకాంతలూ వికసిస్తున్నాయి. బావి దగ్గర బురదలో చేమ మొక్కలు బాగా పెరిగాయి. సాయంకాలపు ఎండ ఆమె పచ్చని వొంటి మీద పడుతోంది. ఆమె విచారం చూస్తే నాకే దిగులు వేస్తోంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అంది.

"మీ విచారం."

ఆమె నవ్వింది.

"తరవాత."

"ఇంకేముంది నాకు? మీ విచారమే."

"నాకు విచారం లేదు నాయనా, నీవు వున్నావు గదా" అని నా తలను తనకు అదుముకున్నది.

భోజనంచేసి అక్కడే పడుకున్నాను. అటు తరవాత మునసబు రాని విచారం ఆమెకి వుండేదికాదు. మునసబు పోషిస్తున్నాడన్న మాటే గాని, మర్యాదలో చిక్కి తన వస్తువును తాననుభవించే యోగ్యతనే పోగొట్టుకున్నాడు. నేనయితేనా అటువంటి మనిషికోసం, మునసబు మర్యాద కాదు. ఆ వోట్లు తీసుకునే మంత్రుల మర్యాద కూడా తన్నేసి వొస్తాను. కాని మా వూళ్లో బడిపంతులంటాడు కదా. ఆ మంత్రులకి, నా శారదమ్మని తలదన్నే మనుష లుంటారనీ—వారే మంత్రిత్వాన్ని నడుపుతారనీ.

మాకు తెలియకుండా మునసబు వొస్తాడేమోనని భయం వుండేది గాని, ఆ యింటికి మంచి అందుబాటులో చక్కని దొడ్డిదారి వుంది.

ఆనాడు నాకు మునసబుగారు పని చెప్పారు, తెల్లారకట్టే లేచి యింకో వూరికి కబురు తీసుకుపొమ్మని. ఆ రాత్రి మునసబుగారొచ్చే రాత్రి కావడం చేత మా యింట్లోనే పడుకున్నాను. కాని శారదమ్మగారితో



సాయంత్రమేకాలం గడిపి వొదలలేక వొదలలేక యింటికి వెళ్ళాను. కాని పడుకున్నా, మునసబు రావడమూ, పక్కమీద నేను పడుకున్నచోటే పడుకోడమూ నేను వొత్తిగిలి అనుకున్నచోటే అనుకోవడమూ, ఆమె యిష్టంలేని యిష్టం నటించవలసి రావడమూ తలుచుకుని బాధపడి ఆమె రూపధ్యానంతోనే నిద్రపోయినాను.

కోడికూతకు లేచి బయలుదేరాను. పెద్ద చంద్రుడు చేలమీద నవ్వుతున్నాడు. తుమ్మలోంచి చల్లగాలి వీస్తోంది. మునసబు లేస్తాడు, వెళ్ళేప్పుడు మళ్ళా శారదమ్మను అనుభవిస్తాడు అనుకుంటో దోవవెంబడి పోతున్నాను. చేల వెనక తుమ్మల అడివి నల్లగా కనబడుతోంది. వెనక గడ్డిబండ్లు వొస్తున్నాయి గావును, యెద్దుల మెళ్ళో గంటలు వినబడుతున్నాయి. నా ముందు చాలా దూరంగా వొంతెనమీద యెవరో కూచున్నారు. దగ్గిరికి వెళ్ళకముందే నే నెవరో యెరిగిన వారని తోచింది. అకారణమయిన భయం వేసింది. దగ్గిరకు పోయి అప్పుడు చూద్దును గదా శారదమ్మే !

జుట్టు విరబోసుకుని వుంది. అయితే రాత్రి పూలు పెట్టుకుని జడ వేసుకుందే అనుకున్నాను. జుట్టు వొంతెన్నీ ఆమె రొమ్మునీ తిప్పుతోంది. తెల్లని చీరె, నేను సాయింత్రం చూపిన మజిలిను రెవిక-పైకి యెత్తిన చేతులు-మీద వెంట్రికలు- ఆమే- ఆమె నా వంక తల యెత్తక కళ్ళు కప్పుకొని యేడుస్తోంది. నివ్వెరపోయినాను.

"ఏమిటిది?"

చప్పున లేచి చెరుగుతో కన్నీళ్ళు తుడుచుకుంటో "వొచ్చావా-వెనక బళ్ళు వొస్తున్నాయి, ఇట్లా రా" అని నన్ను పక్క పొంత దారిలోకి తీసి కెళ్ళింది. అది అడవిలోకి పక్కదారి. నేనా దారిని తెల్లవారకట్ట వెడతానని శారదమ్మతో సాయింత్రం చెప్పి వుండడంవల్ల నాకేమీ ఆశ్చర్యం కలగలేదు. మాట్లాడకుండా వడిగా నడుస్తోంది.

"ఏమిటి చెప్పు. ఇంక భయంలేదు. ఇక్కడ చెప్పు."

"రా, చెపుతా"

"చెపితేగాని రాను."

"నాయనా - నీవు వెళ్లావా? ఆయన వొచ్చాడు. ఎవరో చెప్పారట; మన సంబంధం తెలిసింది. నన్ను చావకొట్టి తరిమేశాడు. ఏంచెయ్యను? చద్దా మనుకున్నాను. నిన్ను విడిచి ఎట్లా చావను? వొచ్చేశాను."

"ఏం చేద్దాం?"

"....లూరు, పోదాం. అక్కడ మావా ళ్ళున్నారు. ఆ వూరు పోవ డానికి అడివి దాటాలి."

"నేను...."

"నువ్వు కనబడ్డావా చంపుతాడు. రా"

"మరి...."

"ముందుకు రా, తర్వాత మాట్లాడుకుందాము."

ఎప్పటికంటే అందంగా వుంది. నా దగ్గిరికి వొచ్చి లాలించదేమా అనుకున్నాను! గాని నా మనసంతా ఆమెకి తటస్థించినకష్టం మీద వుంది. ఏం చేసుకోను యీామెని! మా అమ్మ యేమంటుంది? ఎట్లా బ్రతుకుతాము దగ్గరున్న యిరవైమూడు రూపాయలు యెన్నాళ్ళు వొస్తాయి? అని యోచి స్తున్నాను.

ఆమె నడుస్తోంది. నేను వెనకనే వెడుతున్నాను. కారణంలేని అను మానమూ భయమూ కలిగినయి. కాని అవే రొమ్ములు— ముందుకు విపరీతంగా కొనలు తేలినవి. అవే పిరుదులు— జుట్టులోంచి ధవనం వాసన— ఆమె మొహానికి యెప్పుడూ రాసుకునే రాజా స్నో పరిమళం— ఎట్లా సందేహించను?

పొదలు తప్పించుకుంటో, చర చరా, ముళ్ళూ, తేళ్ళూ, భయం లేకుండా వెడుతోంది. ఆ తప్పించుకునే నేర్పరితనమే నా కనుమానం వేసిందనుకుంటాను. మళ్ళా చూశాను—ఛా—ఏమిటా భయం? ఆమె



వీపు మీద నా నీడ పడుతోంది. వెన్నెట్లో ఆమె భుజాలు చూసి ఆమెని ఆ చేలల్లో ఆ గట్టున అక్కడే పడుకోపెట్టా లనిపించింది— చల్లని ఆకాశం కింద. కాని భయంతో వొణికాను. నాకు అందకుండా నడుస్తోంది. భుజం మీద చెయ్యి వెయ్యాలని తొరగా నడిచాను. అందలేదు. ఆ మా వేగం హెచ్చింది. చప్పున ఒక సంగతి జ్ఞాపకమొచ్చింది— శారదమ్మకు అమిత భయం. నా చెయ్యి పట్టుకునిగాని మంచం దిగదు రాత్రిళ్ళు— ధైర్యంగా యిప్పుడు "ఆగు" అన్నాను, అధికారంతో. నే నాగాను. ఆమె ఆగింది.

ఎగా దిగా చూశాను. ఇంకా చెంపలమీద కన్నీళ్ళు, పాపం, వెన్నెట్లో మెరుస్తున్నాయి.

"ఎవరు నువ్వు?" అన్నాను.

దిగులుతో చూస్తోంది.... ఆ చూపు— పేగులు గద్దకడతాయి. ఈ లోకపు విచారం కాదు. అన్ని ఆశలూ పోయి— నశించి— బూడిద అయిన చూపు.

"నీకు తెలీదూ?"

"తెలీదు. ఎవరు నువ్వు?"

చప్పున పక పకా నవ్వింది. ఆ నవ్వు — అది మాంసములేని పెదవుల్లోంచి— చీకిపోయిన బొమికల గల గల శబ్దాన్ని ధ్వనింపచేసే నవ్వు.

గడ గడా వొణికాను: నిర్మానుష్యమయిన ఆ చెట్ల మధ్య ఆమె ఆకారము మారిపోయినట్టు తోచింది.

ఆమె కాదు, నిశ్చయ మయింది.

ఎట్లా! ఏం చెయ్యను? ఎట్లా తప్పించుకోను?

పిచ్చి దేమో ననుకున్నాను నేను. కాని పిచ్చిది యిన్ని వేషాలు

వెయ్యదు. పిచ్చికి కూడా ఒక ధోరణి ఉంటుంది అనుకున్నాను గావున, పిచ్చిది అనిపించలేదు.

ఎట్లా; నా సంగతి ఏమిటి?

పారిపోతే రోడ్డుమీదికి! వెనక్కి తిరిగితే దెయ్యాలు చంపేస్తాయని జ్ఞాపకం వొచ్చింది. జుట్టు చిక్కించుకుంటే స్వాధీనమవుతాయి యీ భూతాలు.

"శారదమ్మా."

"ఏం?"

"ఇట్లారా."

అని దగ్గరగా వెళ్ళి చప్పున దూకి జుట్టువేపు చెయ్యి జాచాను ఏమయిందో తెలీదు. దూరంగా వెళ్ళి అందకుండా చేతులు జాచి నవ్వుతో "రా" అంది.

వెళ్ళాను. తానూ వెనక్కి తిరిగి నడిచింది. నడిచాము. ఎందుకు వెళ్ళానో?....ఆగితే చంపుతుందేమోనని భయం. వెడితే! అడవిలోకి తీసుకుపోయి పీక్కు తింటుందేమో— ఆగితే యిక్కడే తింటుంది చుట్టూ చూశాను. ఎవరూ లేరు. ఆమె వంక చూశాను. శారదను నిన్న సాయంత్రం నన్ను ప్రేమతో కావలించుకొని యేడ్చింది శారదమ్మే! అదే నడక! అదే మనిషి! ఎంత విచిత్రం! నన్ను తింటుందా? అంత ప్రేమించి! దెయ్యమయితేనేం? నామీద కోపం ఎందుకు? పాపం! ఆ మునసబు అంతా తెలిసి సరికాడు గావును! ఇప్పుడు చూడను శారదమ్మని: ఆ పైకి క్రిందకి స్ప్రింగులాగు వూగే రొమ్ముల్ని, ఆ నున్నని తొడల్ని.... ఆ పెదిమ కొరకడాలు, ఆయాసం— ఆమె యిక లేవు. నిజంగా శారదమ్మ కాదా? ఒకసారి తెలివి రాకూడదూ? ఆమెకి? నన్ను గుర్తించి ప్రేమతో చూడ కూడదా?

"శారదమ్మా."



"మాట్లాడకు. రా. ఆ యేటి గట్టున చెట్టుకింద— అందులో వుంటుంది. రా."

నా కంఠం విని నా ఆశ గ్రహించి ఉంటుంది. నాకేమీ అపాయం చేయదు-అని ధైర్యం చెప్పుకొని పోతున్నాను.

వంతెన— యేటిగట్టు చేరాము- నల్లని చింతచెట్టు నీడలోకి ఒక్క ఉరుకు ఉరికింది.

"రా"

"రాను"

"రా, మాట"

"ఎవరు చంపారు నిన్ను?"

"నన్నా?"

"చంపారు నిన్ను!"

"నన్నా?"

"చంపారు నిన్ను. పాపం, దెయ్యం. నువ్వు దెయ్యం. నేను ఆంజనేయుల్ని తలుచుకుంటాను."

"ఏ ఆంజనేయులు? ఇట్లారా"

"రాను. పో. పిశాచీ"

చీకట్లో తెల్లగా దీనంగా నుంచుంది.

"రావూ?"

ఎవరో వొస్తున్న చప్పుడు.

"పోనీలే. వెడతాను."

నవ్వుతో నీళ్ళలోకి దూకి మాయమయింది. నేను నీళ్ళలో చలనము లేకుండా తేలే చందమామను చూచి ఆశ్చర్యపడుతున్నాను.

మళ్ళా పల్లె ఎట్లా చేరుకున్నానో తెలీదు. ఒకటే ధ్యాస- శారదమ్మ శవాన్ని చూడాలని. ఒక్కసారి ఆమె చేతిని తాకాలని-మూసుకున్న ఆ కళ్ళని-బిగుసుకున్న ఆ రొమ్ముల్ని-చూడాలని సరాసరి ఆ యింటి దగ్గిరికి పోయినాను. ఇంకా బాగా తెల్లవారలేదు. మునసబు ఇంకా ఉంటాడా, అంత పని చేసి-తలుపు కొట్టాను. తీసేవుంది. గుండెలు కొట్టుకుంటో లోపల అడుగులో అడుగు పెట్టాను. చీకటి - మెల్లిగా వెలుగులో మంచం దగ్గిరికి అడుగువేస్తో వెళ్ళాను. ఎక్కడ రక్తంలో అడుగుపడుతుందో-మంచంమీద -ఏ మిటది? తెల్లగా పడివుంది. అదే చీరె-అదే స్నో వాసన-ఆ దెయ్యమే వచ్చిందా? శవమా? మెల్లిగా చేతిమీద చెయ్యి వేశాను. చప్పున పట్టుకుని కళ్ళు తెరిచి చూసింది. "రా పడుకో" అంటోంది.

నేను కెవ్వున కేకవేశాను. పక్కమీదినించి దూకింది. నేను వీధిలోకి ఒక్క పరుగు తీశాను. వొచ్చి గుమ్మంలో నుంచుని ఆశ్చర్యంతో చూస్తోంది. పదినిముషాలు పట్టింది నాకు; బతికివున్న శారదమ్మేనని నమ్మడానికి. లోపలికి పోయి కావలించుకుంటే ఆనందంలో మధ్య మధ్య భయం....

కథంతా చెప్పాను.

"అన్నా! చచ్చిపోయి ఉందువుకదా! అది ఎవత్తో - ఎందుకు పిశాచమయిందో! ఏ కోర్కెలు దానికి తీరలేదో! మన సంగతి యెట్లా కనిపెట్టిందో! నేను చచ్చినా, నీకు అపకారం తలచగలనా?" అంది

తెల్లార కట్ట జరిగింది కల ఏమో అనుకున్నాను. కాని మధ్యాహ్నం మా వూళ్లో బండి శేషన్న కనపడి-

"ఏమిటి వెంకన్నా," తెల్లారకట్ట ఆ వొంతెనమీద కూచుని ఎవరో ఆడమనిషి నీతో మాట్లాడుతోంది? ఎవ రేమిటి?" అని అడిగాడు

ఏమంటారు?

★

# హరిజన విద్యార్థి

నేను హరిజన విద్యార్థిని; నాకొక్క సీటు దయ చేయండి, అన్నాడు ఒక ముక్కుపోగు అబ్బాయి. అనగానే,

'హరిజన విద్యార్థివైతే నాకేం?' అనాలనిపించింది, గాని ఆ తెలుగు వాక్యం అతనికి అర్థం కాదనిపించింది.

హరిజనుణ్ణీ అనేమాట Pass word అయింది ఆ మాట అనగానే వెంటనే లేచి కావిలించుకోవాలి, ఆ మాట అన్న మనిషిని. తరవాత గంగాళంలో నీళ్ళుతోడించి ఇద్దరమూ కలిసి పోసుకోవాలి. లేకపోతే క్రిష్ణకు వెళ్ళాలి. తరవాత విస్తళ్ళు తాకుతూ భోజనం చెయ్యాలి. ఒకటే గ్లాసులోంచి తాగాలి. కూతురు వుంటే వివాహమాడి మా కులగోత్రాలను ఫలితం చేస్తాడేమో కనుక్కోవాలి. ఉద్యోగాలు, స్కాలర్‌షిప్పులు, సీట్లు, ప్రమోషన్లు, అన్ని తలుపులూ "హరిజనుణ్ణి" అనేమాటతో విడిపోతాయి. అన్నీ ఆహ్వానాలే. హరిజనుణ్ణి అనడమూ, గొప్పగా హరిజనుడివా, రా, నాయనా, అని కావిలించు కోవడమూ.

నాకుమాత్రము కంటకంగా ఉంది. హరిజనుడు అనే పదము పుట్టకపూర్వము యిరవైఏళ్ళ క్రిందనించి చివరకు కూడా ఎవరినీ "నీకులం ఏమిటి?" అని అడగని నన్ను హరిజనద్వేషిక్రింద కట్టేవారుండరని నమ్మకం. ఈ హరిజనోద్ధారకులు అందరూ ఇదివరకు నాబోటి వారిని వెలివేసేవారే! ఈనాడు హరిజనులతో భోజనం చేస్తారు గనుక వెలిలేదు.

నేను పూర్వం మాలవాళ్ళతో భోజనం చేశాను. గనుక నాకు మాత్రం వెలి ఇంకా పోలేదు.

పోయిన సంవత్సరం ఒక కుర్రాడు చాలాకాలం బడి ఎగకొట్టాడు.

'ఎందుకు రాలేదు?' అన్నాను.

అతను కారణం చెప్పడం యిట్టా ప్రారంభించాడు.

'నేను హరిజన విద్యార్థి నండి—'

'హరిజన విద్యార్థివా? నాకు తెలినే తెలిదే. ఇన్నాళ్ళూ ఆసంగతి తెలిక నిన్ను దగ్గరికి రానిచ్చానే? ఇంక దూరంగావుండు' అన్నాను.

'ఇంకా చాలామంది ఉన్నారండి'

'ఉంటేనేం? వాళ్ళను కులం అడగనూ అడగను, వాళ్లు చెప్పనూ చెప్పరు. నువ్వు చెప్పావుగా, తెలిసి ఇంక నిన్నెట్టా రానిస్తాను?' అన్నాను.

ఈ హరిజన విద్యార్థి ఏమంటాడంటే, తను హరిజనుడు గనుక తక్కిన వాళ్ళని తోసేసి తనకి సీటు ఇమ్మంటాడు. న్యాయమేమిటా అని ఆలోచించాను.

'హరిజనుడవైతే నేం?'

అని తరచి అడిగితే,

'బీదవాణ్ణి గనక' అని తేలుతుంది.

బీదబ్రాహ్మడే ఉన్నాడనుకోండి.

ఎవరికిగాని ఈ 'సీట్' ఎందుకు?

డబ్బుకి, డబ్బు సుఖానికి, పోనీ జ్ఞానానికి.

ఈ యిద్దరిలో ఎవరికి డబ్బుగాని, జ్ఞానంగాని, సుఖంగాని ఎక్కువ అవసరం?

'మీ తండ్రి ఏం చేసేవాడు' అడిగితే చాలామంది హరిజనులు 'కూలి' అనిగాని 'చెప్పులు కుట్టటం' అని గాని చెపుతారు.

నెలకి ఏ పదిరూపాయలో ఆదాయం ఉండవచ్చు.



బ్రాహ్మణ్ణి అడిగితే 'పౌరహితుడో, గుమాస్తో, భూస్వామో' అని అంటాడు.

సుఖానికి, జ్ఞానానికి అలవాటు పడ్డవాడు బ్రాహ్మడు-కష్టానికి బీదరికానికి అలవాటుపడ్డవాడు హరిజనుడు.

బీదవాళ్ళు—'అయ్యో ఎంత బీదవాడు' అంటారు.

కాని ఎప్పుడూ బీదవాడు, బీదరికం బాధనెరగడు. మంచి దినాలు చూచిన దరిద్రుడికి వుండేబాధ బీదవాడికేమీ వుండదు.

పుట్టినప్పటిణ్ణించి మురికిలో, ఆకలిలో, చిరిగిన గుడ్డలలో పెరిగి, ఎండకి, చలికి అలవాటుపడ్డ వాడి పేదరిక మొకకష్టమా? బాలుడుగా వుండేప్పుడు తండ్రి సంపాయించగా, శుచిఐన భోజనమూ, పరుపులూ, యిల్లూ, శాలువాలూ, అలవాటు పడ్డవాడు, బీదరికానికి ఓర్వడం కష్టం. ఆ హరిజనుడి తృప్తిగాని, ఆరోగ్యంగాని, ఓర్పుగాని యీ కులం గొప్ప వాడికి వున్నాయా? ఈ సీటూ యీ వుద్యోగమూ లేకపోతే, తన గుడిశెలో కూనిరాగాలుతీస్తో, గంజితాగి బలిసే శక్తి వుంది ఆ హరిజనుడికి. ఆ పది హేనురూపాయలు లేకపోతే ఆత్మ నమ్ముకుని బతకాలి యీ బ్రాహ్మడు. లేకపోతే ప్రాణత్యాగం చెయ్యాలి.

'నేను హరిజనుణ్ణి' అనడంలో రాజకీయ కారణాలు, సాంఘిక కారణాలు ఉంటే ఉండవచ్చు. కాని న్యాయం మాత్రం గొప్ప దశనించి పడిపోయిన ఆ జాతే బాధపడే జాతి- కనికరింపబడవలసిన జాతి. ఒక ధనంలోనే కాదు. రాజసౌఖ్యాలకి ఆలోచనలకి సాహసాలకి అలవాటుపడ్డ వాళ్ళ కన్నబిడ్డని బీదతనానికి — క్షుద్రజారత్వానికి, స్వల్ప స్వల్ప ఆలోచనలకి అలవాటైన యింట పెంచితే బాధతొప్పదు. ఆ రక్తానికి తగిన పరిస్థితులుండాలి. పులిపిల్లని పసితనము నించి బోనులో పెంచితేమాత్రం దూకడానికి స్థలంకోసం బాధపడడం మానుతుందా?

తరాలనించి దార్రిదంలో వున్న వాళ్ళబాధ తలచుకొని పద్యాలూ, వ్యాసాలూ వ్రాస్తారు. పత్రికలనిండా అవే!

కాని సమస్త ఐశ్వర్యాలు అనుభవించిన జాతులపతనం—వాళ్ళ బాధని గురించి ఎవరూ వ్రాయరే! రాజ్యాలేలిన వాళ్ళు అడుక్కొంటున్నారు.

జ్ఞానతేజస్సుతో వెలిగినవాళ్ళు విద్యకై యాచన చేస్తున్నారు—వీళ్ళబాధని ప్రకటించరేం?

హరిజనుడి గతి తలుచుకొని ఉపన్యాసాల్లో, పద్యాల్లో, కారే కన్నీళ్ళన్నీ ఈ క్రొత్తప్రచారం వచ్చిందాకా ఎక్కడ దాక్కున్నాయి?

మా పూర్వీకులు దర్రిదులు గనక నాకు 'సీటు' కావాలని ఒకరు అడగ్గాలేనిది, నా పూర్వీకులు ఈదేశాన్నంతా, ఆధ్యాత్మకజ్ఞానంతో నింపారు. ధనాన్ని తృణప్రాయంగా త్యజించారు. శరీరాన్ని తపింపచేసి, శుష్కించి, ప్రజా సేవచేశారు. నాకొక్క 'సీటు' యిమ్మనకూడదూ!

ప్రపంచం చూసినకొద్దీ, మనుషులందరూ ఒకటేనన్నమాట అబద్ధంగా కనపడుతోంది. మృగాలన్నీ వొకటే. మనుష్యులూ మృగాలూ వొకటే, అని అంటే ఎంత వాస్తవంగా వుంటుందో ఇదీ అట్లానే వుంటుంది.

'అయ్యో దున్నపోతు వానలో తడుస్తోంది పడక గదిలో కట్టివెయ్యరా!'

'పంది బురదలో పొల్లుతోంది శుభ్రంగా స్తానం చేయించరా!'

'ఆ చిలక అట్టా ఎగురుతుందే? పడిపోతుంది పంజరంలో పెట్టరా' అన్నట్టవుతుంది మన తెలివి.

లోకమంతా నన్ను 'ఛీ ! మాలకూడు తిన్నాడు' అన్న కాలంలో యీ హరిజనోద్ధారక యోధులందరూ 'ఛీ, ఛీ తిన్నాడా ?' అన్నవారే! అప్పుడు మాలవాళ్ళమీదా, వాళ్ళని తాకినవాళ్ళమీద వుమ్మేసే రోజులవి.



ఇప్పుడు వాళ్ళనే పూలదండలువేసి గౌరవించే రోజులొచ్చాయి. ప్రపంచం మెచ్చుకుంటోందని తెలీగానే, వూరికే ఒకరినొకరు తోసుకుని, స్త్రీ పురుషులు పత్రికల్లోకి హరిజనోద్ధారకులకింద బొమ్మలూ పేర్లు ప్రకటించుకున్నారు.

పదేళ్ళకింద వారందరూ బతికేవున్నారు. అప్పుడూ యింకో రూపంలో యింకోపేరుతో యీ వుద్యమం వుండనే వుంది. ఏమైనారు వీళ్ళందరు ?

ఇతరుల దార్రిదంలో కష్టాలలో సానుభూతిచూపే హృదయం.... ఎప్పుడూ చూపుతుంది. ఆ సానుభూతి fashion అయ్యేవరకు ఆగదు.

"హరిజన నిధికి చందాకి వచ్చింది ఒకామె నాదగ్గరికి."

"మీరు అతనికన్న హీనస్థితిలో వున్నారు. ముందు మిమ్మల్ని మీరు వుద్ధరించుకోండి." అన్నాను.

"మీరు" అంటే ఎవరండోయ్ ?

"అంటే స్త్రీలు"

"మాకేం?"

"మీరందరూ అంటరానివారే !"

"ఏం ?"

"బహిరంగంగా మొగవారు తాకకూడదుగా !

ఒక్క గాజులవాళ్ళూ మంగలవాళ్ళుతప్ప.

అంతేకాదు. మీలో చూడరానివాళ్ళు ఉన్నారు. హరిజనులకన్న అధమస్థితి మీది."

"చూడరాని వాళ్ళెవరు ?"

"గోషావాళ్ళు"

"కాని అంత బీదవాళ్ళం కాదుగా !"

"నాకేం ? అందరూ యాచకులే, మొగుళ్ళ దగ్గర."

"ఆస్తివున్న స్త్రీ లెందరు ? ఎందరు బైటపడి కానీ సంపాదించ గలరు ?"

"మీ బట్ట మీదికాదు. మీ తిండి మీదికాదు" అన్నాను.

ఆమె వెళ్ళింది కోపంతో.

ఇంకా స్త్రీల వుద్యమంలో పనిచెయ్యడం కొంతవరకే fashion అయింది- మీటింగులూ కాన్ఫరెన్సులూ—కనక అంతవరకే పనిచేస్తారు వివేకవంతులందరూ. పూలదండలూ- అచ్చులో పేర్లూ—అదృష్టముండే బొమ్మలూ !

★

# హత్య విచారణ

మూడివిజన్ పోలీసువాళ్ళందరమూ కిందనించి పైదాకా సర్వ మందు నిద్రపోతున్న ట్లున్నామని సూపరెంటునించి గూటింపులు తీవ్రంగా వొచ్చినరోజే "టోలుగేటు" పక్కన కొత్తమొండెమూ, గాడిబావిదగ్గిర తలా దొరికాయి. యింక యీకేసన్నా శ్రద్ధవహించి ఆచోకీ తియ్యకపోతే, "సస్పెన్షన్" దాకా వొస్తుందని మూడురోజులు నిద్రాహారాలు లేకుండా



తిరిగి దోషుల్ని గుర్తించాను; కాని వాళ్ళు నలుగురూ మాయమైనారు. ప్రచ్ఛన్న స్వరూపంలో వాళ్ళ జాడలు పసిపడుతో పల్నాటిసీమను పడ్డాను. వేళకు తిండిలేక, బళ్ళల్లోనూ, బస్సుల్లోనూ కునికిపాట్లుతప్ప నిద్రలేక, నా పాత స్నేహితుడు చలిజ్వరం మళ్ళీ కొంచెంగా పలకరించగా, చివరికి వాళ్ళ నందుకున్నాను. యింక వలవేసి వాళ్ళని పట్టాలి. పూర్తిగా అలిసిపోయినాను. విసుకు పుట్టింది. బతుకంటే ధైర్యం చచ్చింది. నా ఆరుగురుపిల్లలూ భార్యా తిండిలేక గిలగిలలాడడమూ, అందులో నలుగురు ఆడపిల్లలూ ఐదేసివేలు అర్పించమని కాళీ అవతారాల్లాగ నా గుండెలమీద కూచోడమూ, వీటివల్ల పస్తాయించాను గాని, లేకపోతే ఆ క్షణాన వెధవనౌకరీకి ఒక్క పెద్ద సలాము చెప్పి, మా పూర్వుల యాయవారం చెంబు నాశ్రయించి వుందును. నౌకరీల్లోకల్లా నీచమైన నౌకరీ పోలీసునౌకరీ.

రాత్రులు వూరివెలపల అడివిలో నాకు కావలసిన పెద్దమనుషులు నలుగురూ చేర్తారని తెలిసి, యీలవేస్తే అందేట్టు జవాన్లని దాక్కోమని చెప్పి, నేను గొంగడీ కప్పుకుని బైలుదేరాను. ఆ చలికాలపు సాయింత్రం, గుడిశవెనకనించి చింతతోపులో యెర్రగా కాలుతోంది పడమటిమూల. నే ననుకున్నట్టే తలుపు బిగించివుంది; దొంగదగ్గు దగ్గుతో వొణుకుతో రేగి పొదకింద మఠం వేశాను. ఆకాశ్త వెలుతురూ మాయమయింది; చింతల్లోంచి పురుగులు కీచుమంటున్నాయి. గబ్బిలాలుగావును నల్లగా నలుపులో రెక్కలు కొట్టుకుంటో భూతాల్లాగు లేచిపోతున్నాయి. అక్కడక్కడ జరజరమని యెండుటాకులమీద అనుమానంగా పాకుతున్నాయి యేవో. యీల నోట్లో పెడితే పదిమంది యెములవంటి జవాన్లు వస్తారనే ధైర్యమే లేకపోతే, వాళ్లు నా పిరికితనానికి నవ్వుతారనే భయమే లేకపోతే, వెంటనే పరుగెత్తుదును భయంకరమైన ఆ చోటునించి. దూరంనించే పాట పాడుకొంటో నెత్తిన కడవ పెట్టుకుని ఒకామె వొచ్చింది. ఆ పాట వింటేనే నాకు భయంతో వొళ్ళు వొణికింది. చింతల చీకట్లో,

ఆకాశపు సంధ్య ఎరుపుల్లో, హత్యల రక్తంలో, క్రూరుల ముద్దుల్లో, నరబలుల పాపంలో నానింది ఆ గొంతు. కాని ఆ భయంలోనించి ఆనందం కలుగుతోంది. ఆ కంఠస్వరపులోతు. ఆ మాటల పటుత్వం, ధీరత్వం, నల్లని స్త్రీ నల్లనిచీర కట్టుకుని చింతనీడల చీకట్లో నుంచుని, ఆగి, నావంక తిరిగింది.

"యెవ్వరు ?"

యెంత ధైర్యం, పొగరుబోతుతనం ! మూలిగాను. దగ్గాను.

"యెవరు తాతా నువ్వు?"

"నేను తాతను కాను."

నవ్వింది యేం ధైర్యం ? ఆ గుడిశే నాదై, ఆ రేగిచెట్టుకింద చీకట్లో యెవరో దగ్గితే, కడవ పారేసి వెనక్కి విరుచుకుపడుదును నేనైతే.

"అంతా మోసమే !"

కనిపెట్టిందా యేమిటి ?

"జబ్బుగా వుంది."

"యేవూరు ?"

బొంకాను.

"యెవరు ?"

బొంకాను.

"యెక్కడికి వెడతావు ?"

"యెక్కడికేముంది, యింత ప్రపంచంలో."

"యిక్కడికే నన్నమాట !"



కనిపెట్టిందా ? బెదిరింపా ?

"చలి, చలి."

పళ్ళు పటపట మనిపించాను. కడవ దింపి తడిక వూడతీసి, దీపం వెలిగించింది.

"అక్కడే వుండు పిలిచిందాకా."

కడవలోంచి కల్లుకంపు కొడుతోంది గదిలో సద్దుతోంది.

"రా, తాతా."

"తాతని కానంటే !"

"రా, పడుచూ"

పకపకా నవ్వింది. చుట్టూ చింతలూ, నేపాళాలూ, చిటిరేగి పొదలూ, గుడ్లగూబలూ నవ్వాయి. గుడిశె నాలుగుపక్కలా చూశాను. ఒకమూల పొయ్యీ, తాళ్ళూ, నాలుగు గోనెలూ, గొంగళ్ళూ, ఒక పెద్ద పెట్టీ, మూడు కుండలూ-అంతే. యేమీ అనుమానాస్పదంగా లేదు. నన్నామె కళ్ళు పరీక్షించడం, 'ఫీ'లై, నే నామెవొంక తిరిగి చూశాను. ముప్పైయేళ్ళుంటాయి. వక్షము చాలా యెత్తు. అంతయెత్తు. బలుపూ, బిగుపూ, ఐన రొమ్ముని నేనెప్పుడూ చూడలేదు. నడుము సన్నము. ఆమెనీ, ఆ గంభ్ర మొహాన్నీ, ఆగట్టి పెదవుల్నీ, మొహంమీదపడే జుట్టులో కనపడని కళ్ళనీ, ఆ వొంటి రంగుని చూస్తే, రాతిలో చెక్కిన విగ్రహం ప్రాణం ధరించి కదులుతోందనిపిస్తుంది. జుట్టులోనించి కళ్ళు కనపడకపోయినా చూపులు మాత్రంసూటిగా వాడిగా గుచ్చుకుంటాయి. ఆ భుజాల యెత్తూ, తొడల జవజవా,ఆ కంఠం గుంభ్రదతనమూ,ఆ వెంట్రుకల బిరుసూ,చూస్తే, పురాతనపు రాక్షసాంనగల ఆకర్షణ యిట్లా వుండేదేమో అనిపించింది. చప్పున నా కళ్ళనించి తిరిగి, పొయి వెలిగించి, దీపం గుమ్మం అవతలగా బైటపడుతో నా వంక చూసి, చిరునవ్వుతో 'పురుగులు' అంది, బైటదీపం లోపల కొత్త వాడున్నాడని తెలిపేందుకని నాకేం తెలుసు ?

పొయ్యిమంటలు గంతులేస్తున్నాయి. వాటికి తాళమేస్తో చీకట్లు గోడలమీద నాట్యమాడుతున్నాయి. బొద్దింకలు చెదిరి పరుగెత్తుతున్నాయి. బూజు కళ్ళమీదకి వేళ్ళాడుతోంది.

'తాతా, గంజి తాగుతావా ?' అంది బియ్యం కడుగుతో.

నవ్వుతోందా ?

'తాగను మరి ! సాయింత్రం నించి ఆకలిగా వుంది. పొద్దున్న ఆ కోమటి తల్లి పోసింది యింత చద్ది అంబలి అంతే.'

పొయ్యిమీద బియ్యంవేసి,

'యిప్పుడే వొస్తా కూచో' అని, చెంబూ నీళ్ళూ పట్టుకుని వెళ్ళింది. పొయి యెదురుగా కూచున్నాను. వొస్తారా వాళ్ళు? నే నున్నానని భయపడి వెనక్కి పోతారా ? యీ ఆడమనిషి వుంటుందనుకోలేదు; వాళ్ళే రావడం, యీలవేసి పట్టించడం అనుకున్నాను. కానీ !

పావుగంటలో వొచ్చింది. తలలో తెల్లని పూలేవో పెట్టింది. వాటి వాసనతో గుడిశ నిండింది. నల్లని బూజుపట్టిన మూకుడు పెట్టి దాంట్లోనే గంజిపోస్తోంది. మనసు పట్టలేక పోయినాను. పుట్టింది బ్రాహ్మణ పుట్టుక!

'అది కడుగుదూ !'

పక్కున నవ్వింది.

'అలవాటు లేదు గావున !' అని,

కడిగింది. యెంత ఆచారాలు వొదిలినా విస్తరి చుట్టూ నీళ్ళు చుట్టడం మానలేదు. చెయ్యన్నా కడుక్కోకుండా ఆ మూకుడులో మెతుకులు ఏరదామంటే. చెయ్యి సాగదు. కాని వొణికానా, సందేహించానా, యీ శ్రమంతా వృధే ! ముక్కు మూసుకుని, మూకుడెత్తి ఔషధం మల్లే తాగాను.



'యేం తాతా, మాయ కోమటిదాని వుత్త అంబలే రుచిగా వున్నట్టుందే !'

నవ్వింది.

'యిది వేడిగా అన్నా వుంది.'

'మూతి కాలుస్తుంది· జాగ్రత్త. యింకొంచెం తాగుతావా ?'

'వొద్దు.'

కుండెడు గంజీ అవలీలగా లోపల పోసేసుకుంది.

'యీవాళ. పిట్టలు దొరకలేదు.'

'యెట్లా దొరుకుతాయి ?'

పైన చూపింది. గాండీవమంటిది విల్లుబద్ద వుంది.

'నన్ను తినాలని మృగమేదన్నా అప్పుడప్పుడీ గుడిశలో దూరుతుంది. నేను దాన్నే కోసుకుతింటాను.'

ఆ బెదిరింపుతో హడిలిపోయినాను.

నేను గుడిశ బైటికి పోయి చుట్టూ చూశాను. నా గుండె కొట్టుకుంటోంది. చప్పున అట్టా చీకట్లోకి పరిగెత్తుకుపోతే తోకజాడించి యీ గుడిశలో పడుకుని బైటికి రాగలనా ? కాని దోవ తెలీదు, యెక్కడికి పోను ? జవాన్లు వొచ్చి కాచుకుని వున్నారా? కాని వాళ్ళ సహాయం అడుగుతానా? ఆడదానికి దడిసి పరిగెత్తి. యింక గౌరవం వుంటుందా? దైవాన్ని నమ్మి, నా ఉద్యోగాన్ని తిట్టుకుంటో కూచున్నాను. నా పక్కన వొచ్చి అది కూచుంది.

'తాతా, చుట్ట కాలుస్తావా ?'

తాత గానంటే యే మిస్తుందో ?

'అలవాటు లేదు.'

'పొడుం ?'

'లేదు.'

'బీడి ?'

'ఊహూఁ.'

'తాంబూలం అలవా టనుకుంటా.'

నవ్వింది.

'నువ్వు వొక్కత్తెవూ వూరి బైట యిట్లా వొంటరిగా కాపర మున్నా వేం ?'

'వూళ్ళో కుక్కల్ని చూస్తే నా కిష్టంలేదు.'

'కుక్కలూ !'

'రెండు కాళ్ళ కుక్కలు.'

'యెందుకా కోపం ?'

'కుక్కలు గనక.'

'నీకు పెళ్ళికాలా ?'

'అయింది.'

'ఏ డీ?'

'ఆకలేసి, తినేశాను.'

'తరవాత యేం తింటున్నావు ?'

'దోవపొయ్యేవాళ్ళని.'

నవ్వింది.

'నీకు పెళ్ళయిందా, తాతా !'

దగ్గిరిగా జరిగింది.



'పెళ్ళే నాకు !'

'కాలేదా ?'

'లేచి పోయింది.'

'ఐతే, యెట్లా, తాతా !'

'పిల్ల నిప్పిస్తావో.'

'పిల్లెందుకు నీకు ? నాయీడుదాన్ని కట్టుకో.'

'వుందా ?'

'వెతకడ మెందుకు ? నే నున్నానుగా ?'

'నువ్వే !'

'యేం ? నేను బావుండలా ?'

దగ్గిరిగా అనుకుని కూచుని, ఒక చెయ్యి నా మెడమీద, ఒక చెయ్యి నా వొళ్ళో జారనిచ్చింది.

'యీ అడివంతా మన రాజ్యం. నీకు రోజూ గంజి కాచి పెట్టి, యీ కడవలోది.... అబ్బో, తాతవు కావే ?' అని,

చప్పున దూరంగా జరిగింది. ఆమె స్పర్శతో నా వొళ్ళు పులకరించింది. మళ్ళా వొచ్చి యెదురుగా కూచుంది. పమిట నేలమీదికిజారింది, రెవిక పక్కలకి తొలిగింది. కళ్ళు తిప్పలేక, బలవంతంగా చూపుల్ని పైకి లాగుతో బాధపడుతున్న నా కళ్ళకేసి చూస్తో చంపల కింద చేతులేసుకుని కూచుంది. ప్రయత్నంతో నేను నా భార్యనీ, చిన్నమ్మాయి ముద్దుమాటల్నీ మా సూపరెంటు ముఖాన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటూన్నాను, లేచి.

'పడుకుందాం రా. తాతా, పొద్దుపోయింది' అంది.

గుడిశలో మూల గొంగళీ నా కిచ్చింది. తడికదగ్గిరిగా తను పరుచుకొంది.

'యిటు వేపు దొల్లకేం, అడదాన్ని చేసి, నీ సంగతి నాకు తెలుసు'

నేను మాట్లాడలేదు. నా కాశ్చర్యం యెక్కువౌతోంది. నిద్ర మాత్రం పోకూడదు. కళ్ళు మూశాను. మళ్ళీ యెక్కడో కళ్ళు తెరవడం. పడుకున్నాను యెంతోసేపు చీకట్లో చూస్తో. అప్రయత్నంగా కునుకు పట్టింది గావును. మెల్లిగా చెయ్యి నా గొంగడీ కిందికి దూరడం నన్ను లేపింది. చప్పున చెయ్యిపట్టుకున్నాను.

'నేనే తాతా.'

'ఐతే, యేమిటిది ?' అని బిగ్గరగా కేకేశాను.

'అమ్మా, తాతవుకాదే. చెయ్యి విరిచేశావు.'

నా పక్కన పడుకుని దగ్గిరిగా జరిగింది. నాపైన బలువుగా ఒక కాలూ చెయ్యీ వేసిం ది.

'తాతా, నన్ను పెళ్ళాడరాదూ?'

నవ్వింది, ఆ నవ్వు నా నరాల్ని లాగుతోంది.

'సరే, రే పొద్దున్న కద!'

'కాదు, యిప్పుడే. అందాకా వుండగలనా ?'

యెందు కాచెయ్యిని మళ్ళీ గొంగడీ కిందికి పోనిస్తోంది ? ఆమె పెదిమలు నా పెదిమల్ని నొక్కుతున్నాయి. జవాబు చెప్పడానికి వీల్లే కుండా నా పైకి బాగా వంగి ఒక చేత్తో చేతిమీదిగా మెడకిందికి పట్టుకుని, బలమంతా నా మీద ఆనించి రెండో చేత్తో గొంగట్లో వెతుకుతోంది. ఆమె జుట్టు నా మొహాన్ని కప్పింది. ఆ అడవి పువ్వులు ఘుమ్మున్నాయి. కల్లుతో నిండిన శ్వాశ నా మొహాన్ని ముక్కుల్ని కప్పేసింది. ఆమెని కావలించుకోడానికి నా చెయ్యి పైకి లాక్కోపోయినాను. కాని గట్టిగా రొమ్ముతో అదుముతో రానీలేదు. బావుంది, యెంతో సౌఖ్యంగా వుంది. కదలకుండా పడుకున్నాను. కాని ఆమె చెయ్యి, మెల్లిగా పాములాగు



జరుగుతోంది. వెతుకుతోంది. జొరబడుతోంది. నా వళ్లు ఝుల్లు ఝుల్లు మని ఆమె వేళ్ళకింద వొణుకుతోంది. కాని మొగాణ్ణి. స్వేచ్ఛ లేకుండా ఆమె చేతులమధ్య చిక్కి....

'నిన్ను చూడగానే, నీ దొంగదగ్గుని, నీ పెద్ద ఛాతీని, నీ పెద్ద మీసాల్ని, నీ మాయ వొణుకుని....నాకు నీ మీద యెంత మనసు కలిగింది ! యింక వెళ్ళవొద్దు. ఒంటరిదాన్ని యీ కారడివిలో! పగలూ రాత్రీ యెప్పుడూ యిట్లా—'

యింక వినరాని మాటలు, నా రక్తం పొంగించే మాటలు. చెవులు మూసుకోవా లనుకుంటో చెవులు విప్పి వినే ఆ మాటలు, మొగవాడి అహంభావాన్ని హెచ్చించే మాటలు, జన్మ సార్థకమయిం దనుకునే మాటలు ముద్దుగా రహస్యంగా మాట్లాడింది. కాని ఆ చెయ్యి— తీసేస్తోంది. వొదిలించుకుంటోంది. యేమిటా చల్లగా ? నా గుండెలు కొట్టుకోడం ఆగాయి. బాబోయి నా రివాల్వరు లాగేసింది! చప్పున నా బలమంతటి తోనూ తిరగబడ్డాను. కలియబడ్డాను. వొదులుతున్న చేతుల్ని పట్టుకున్నాను. దాని బుజాలు పట్టుకుని వొంచాను. కాని పాములాగు, చుంచు లాగు, నున్నగా జారింది, తప్పించుకుంది. దాంట్లో గుళ్లున్నాయి. పేలితే! నా మీదే పేలితే! వెతికి ఒక చెయ్యి పట్టుకున్నాను. యింక మల్ల యుద్ధ మయింది. యెట్లాగైతేనేం ఆమెని కిందచేసి నేను పైన కూచున్నాను. చేతు లందనీదు. కోపమొచ్చి కొట్టాను. కొరికింది. యిద్దరి శ్వాసలూ, గుడిశలో ఆ తోపు నిశ్శబ్దంలో గంభీరంగా వినపడుతున్నాయి. యెంత సేపు పెనుగు లాడామో! టుపాకి పేలితే యెంత సేపు! దొంగముండ ! గొంతు నొక్కాను. చంపెయ్యాలనే ! మొగాణ్ణి ! దీన్ని గెలవలేనూ ! యెంత బలముంటేనేం ? ఆడది గెలవగలదా ? చప్పున పట్టు వొదిలింది. చేతులూ మెడా వేళాడేసింది. చచ్చిందా ! మూర్ఛా ! ముందు రివాల్వరేదీ ! మీద కూచుని చేతులు వెతికాను. లేదు. రెవిక విప్పి వెతికాను. యేదీ ! కోపంతో

రెె పూడతీసి పారేశాను. లేదు. నేను చేస్తున్నపని చూసి, కొంచెం కాలం ందటి సంగతి జ్ఞాపకం వొచ్చి నవ్వొచ్చింది. గుండెలమీద చెయ్యేశాను. కొట్టుకుంటున్నాయి. స్పర్శ నా సుఖంతో చెయ్యి అక్కడే ఆగింది. చ్చగా ఆ గట్టిచర్మం! కావిలించుకుంటే. కాని రివాల్వరు. ఒక్క పాపు పూపింది. కింద పడ్డాను. చప్పున లేచింది. దూరంగా వెళ్ళి క్కన గుడిశ మూరుమోగేట్టు నవ్వింది.

చప్పున దూకాను. పెద్ద కొయ్యతో నా తలమీద దెబ్బపడ్డది.

'యీసారి దొంగల్ని పట్టుకోడానికి వచ్చినప్పుడు రివాల్వరు సరిగా చుకో. వేసింది తాతవేషం, మాట్లాడేది బ్రాహ్మణమాట!'

చప్పున యీలతీసి పూదాను. తలమీద యింకోదెబ్బ పడ్డది. కింద డ్డాను....

ఆస్పత్రిలో కళ్లు తెరిచాను.

'యేా మయింది?'

'యెవరూ?'

'అదీ!'

'యేదీ?'

'ఆ మనిషి'

'యేవరూ లేరే!'

'ఆ గుడిశలో యేం దొరకలా?'

'ఒక చీరా, రెవికా.'

★

# ఆద్మీ ఫిల్మూ - ఆంధ్రదేశమూ

"ఆద్మీ చూశారా?"

అన్నారు రామశాస్త్రిగారు. అప్పటికింకా ఆయన పేరూ, పూరూ ఏమీ తెలియవు. నే నెరిగిన రామశాస్త్రులకంటె నా ఆత్మ సన్నిహితులా కారనే తెలీదు.

"ఎవరది?"

"ప్రభాత్"

"శాంతారాం నాకు నచ్చే ఫిల్ము తియ్యలేడని నమ్మకం చాలా కాలం కిందనే కుదిరింది నాకు. శాంతా ఆప్టే వుందా?"

"హుబ్లికర్"

"ఏదోవొక శాంత" అన్నాను సినికల్‌గా.

"ఈ ఫిల్ము చూడండి. నేను పధ్నాలుగుసార్లు చూశాను. మళ్ళీ చూడాలని బెజవాడ వెడుతున్నాను. మీరూ చూడండి."

చూడడం పడదని తెలిసే 'ఊ' అన్నాను.

"ఏమిటి ఆ ఫిల్ములో గొప్ప ?" అన్నాడు అన్నీ తెలుసుకోవాలని ఆత్రుతపడే శిరోమణి.

ఆంధ్ర డాస్టవిస్కీ శిరోమణి కాదు. ఈయన యింకో శిరోమణి.

"ఆ ఫిల్ములో గొప్పకానిదేమిటో చెప్పలేను."

"కథ యేమిటి ?"

"పోలీసు జవానుకీ వేశ్యకీ జరిగిన ప్రేమగాథ."

వోడ్‌హౌస్ లిటిల్ Bachelorలో పోలీసు జవాను కవిత్వం నేర్చుకునే ప్రయత్నాలమీద తెప్పించిన నవ్వు జ్ఞాపకం వొచ్చింది, పోలీసు జవానుకి ప్రణయం అంటకట్టడం సాహసకార్యమే!

* * *

రుక్మిణీనాథశాస్త్రిగారు (ఇంతపేరు ప్రతిసారీ వ్రాయడం యిబ్బందిగా వుంది.) రాత్రి తొమ్మిదింటికే లేచారు, మాటల్లోంచి.

"సూరీ వాళ్ళు సినీమాకు వెడతారట నా కోసం కాచుకొని వుంటారు."

"ఏ ఫిల్ముకి."

"ఆద్మీకి"

మళ్ళీ ఎదురయ్యిందా నాకు ?

పొద్దున్నే గేటుదగ్గిర్నించే తిట్టుకొంటో వొస్తున్నారు ఆయన.

"రాత్రి ఆయనకు బందరు రచయితలు ఎవరన్నా కనిపించలేదు కదా! లేక ఫిల్ములో దర్బారుసీను చూపారా?" అనుకున్నాను.

"ఆ ఫిల్ము : ఆద్మీట : కిక్కిరిసి వొచ్చారు చూడ్డానికని : బుద్ధి లేదు. న్యూథియేటర్సుని వెక్కిరించి సులభంగా ఖ్యాతి కొట్టెయ్యాలని గంతులేసాడు ఆ శాంతారాముడు" అని ఆగారు.



"—వెక్కిరించా ?"

"ఆ, మరేమిటి ?

ప్రేమకి ఆకులు

ప్రేమకి చెప్పులు

ప్రేమకి నీళ్ళు"

అంటాడు. "ప్రేమనగరికి పోవడానికి టిక్కెట్టుకి డబ్బు లేదట వాడి మొహం !"

నాకు సంతోషం వేసింది. ప్రేమజాడ్యాన్నీ, అంతకన్న ప్రేమ అంటో పలవరించే నా బోటి కథకులకీ కవులకీ చాలా Health giving dose ఆరోగ్యకరమైన మాత్ర అనుకున్నాను.

"చాలా బావుందండీ ; అవసరమేమో ఆ వెక్కిరించడం"

"ఏమో ఆ ఫిల్ములో బావుండలేదు."

"అంతేనా ?"

"అంతేనేమిటి ? అసలుసంగతి వినండి. ఆ ఫిల్ములో తెలుగు పాడారు. అచ్చ ఆంధ్రం, ఆపాట మన-రాశాట్ట. అతనికి వుత్తరం రాస్తున్నానుగా 'ఒక్క పాటరాశి ఫిల్ములో పెట్టి, ఫిల్మునంతా దురదృష్టంతో తగల పెట్టావ"ని !

"అదా మీకోపం ?"

"నా కోపమేమిటి ? నా సరదా ! కథ సగంవరకు తీసికెళ్ళి ఏం చెయ్యాలో తోచక, గుటక కేసి, ఈ అయ్యనీ ఆ అయ్యనీ చెప్పమని ఆశ్రయించి, ఆ ముక్కతో, ఈ ముక్కతో, పూర్తిచేశాడు."

"అందరూ ఏమంటున్నారు ?"

"ఏ అందరు ?"

"మీతో వొచ్చినవాళ్లు"

"వాళ్ళు....అందరికీ .... విశ్వనాథ సత్యనారాయణగారు కూడా వొచ్చారు. ఆయన్నికూడా పట్టుకున్నాను, **Opinion** చెప్పమని"

"ఏమన్నారు ?"

"ఆయనకి ఇష్టంకాక ఏంచేస్తుంది ?"

"ఏం ?"

"ప్రేమ కవుల్ని తిట్టారుగా ?"

రామశాస్త్రిగారుకాని కుటుంబరావుగారుకాని లేక బోయినారే అని దిగులుపడ్డాను. వాళ్ళ లేనిలోటు నేనే తీర్చాలి.

"ఒక మిత్రుడు ఆద్మీఫిల్మ్ పధ్నాలుగుసార్లు చూసి...."

"మూర్ఖుడు. ఆయన ఎవరో చెప్పకండి. అపాయాలు జరగవొచ్చు."

"ఆయన చాలా మంచి అభిరుచులు గలవారు"

"ఆయన ఎందుకు ? ఈరాత్రి మీరు చూడరాదూ ! మీకే తెలుస్తుంది."

తలవూయించాను. చూడడం పడదని తెలిసే.

* * *

బస్సులో వెనకసీటులో చీకట్లో యిద్దరు రసికులు (అసలు అర్ధంలో, కామపరంగా కాదు.) తెల్లారికట్ట చలిలో వొణుకుతో వేడికోసంగావును, మాట్లాడుకొంటున్నారు.



"రాత్రి వుండిపోయినాను, విశ్వనాథ సత్యనారాయణగారి ఉపన్యాసం వుందని విని, నే నెప్పుడూ ఆయన్ని చూడలేదు. ఆయన చాలా కరుకుమనిషి అన్నారు గాని, ఏమీకాదు....నాతో...."

"నేను మళ్ళీ పెళ్ళికి వెళ్ళాను. అసహ్యంగా వుంది."

"చాలా బావుంది. అట్లా అంటారేం ?" అని అనవసరంగా అందుకున్నాడు, బస్సుకి దాహా అందిచ్చే కుర్రవాడు.

ఒకాయన నవ్వాడు.

"అభిప్రాయభేదం." అదే నిన్న ఉపన్యాసంలో విశ్వనాథ సత్యనారాయణగారు అన్నారు. 'మేము ఆద్మీ ఫిల్ముకి వెళ్ళాము. నా పక్కన కొందరు మిత్రులు చాలా అద్భుతంగా వుందని అంటున్నారు. కొందరు ఛీదరించుకుని ఉమ్మేస్తున్నారు. నన్నడిగారు, వీళ్ళూ వాళ్ళూ కూడా. యేం చెప్పను? ఎవరికి కోపం తెప్పించను?' అన్నాను అన్నారు సత్యనారాయణగారు" అంటున్నారు బస్సు సహచరుడు.

సత్యనారాయణగారు కూడా కోపం తెప్పించడానికి జంకారా ? అని అనుమానించాను నేను

* * *

దీపావళి పత్రికలో ఆద్మీని ఘోరంగా విమర్శించారు. కారణాలు తెలియంగా కనపడ్డాయి. హరీన్ చటర్జీ సంగీతం విషయమై, నాతో, సాతో, ఏకీభవించి, శాంతా ఆప్టేనీ, కర్ణాటక సంగీతాన్ని గంగలోకి నెట్టిన రామశాస్త్రీ యీ ఫిల్ముని పధ్నాలుగుసార్లు వూరికే చూస్తారా ? పైపెచ్చు ఆద్మీలో సంగీతం బావుందని మూర్ఛలు పోయారు.

మాస్టర్ కృష్ణా మళ్ళీ జన్మమెత్తికూడా నన్ను సంతోషపెట్టలేదని దృఢవిశ్వాసం నాకు. మరి రామశాస్త్రిని ఎట్లా టోపీవేశాడో! ఎప్పుడో కాని కనపడదేం రామశాస్త్రిగారు అడుగుదామంటే!

ఇన్నిరకాల నిశ్చితాభిప్రాయాలు ఒకే దేశంలో ఎక్కడ దొరుకుతాయి. యిన్నిరకాల డ్రెస్సులు, షోకులు, ఫాషన్లు, అభిరుచులు యీ తెలుగు దేశంలోగాక! జాతీయత అనే పేరుతో ఇంత వెరయిటీని dead **uniformity** కింద మారుస్తారా? ఏ ప్రత్యేకతా వుండకూడదనే ప్రత్యేకత వుంది కదా? ఏది నచ్చితే అది, ఏ దేశంది ఏ కాలంది, ఏ మనిషిది, ఏదైనా అంగీకరిస్తామనే విశాలదృష్టి యింకెవరికి వుంది! ఇంతధిక్కారం, ఈ ప్రమాణ వైరుధ్యం, యింత నిర్లక్ష్యం, నిర్భయత్వం, అనాయకత్వం, అనధికారత్వం—"

* * *

షా, చే, "ఆద్మీని చూశాం" అని చెరో చెయ్యీ పట్టుకున్నారు.

ఎట్లావుంది అని ఆత్రుతతో అడిగాను సౌరీస్‌ని, సౌరిస్ చూస్తే నేను చూసినట్టే.

"చాలా బావుంది. సంగీతంతప్ప"

కొంచెం కుదుటపడ్డది నా గుండె, నేను దీపావళిలో చదివిన విషయాలు ఏకరువు పెట్టాను, వొప్పుకోడం ఇష్టం లేనట్టే ఆలోచించింది.

"అవునులే. నిజమే. కాని శాంతా హుబ్లీకర్‌ని నువ్వుచూసి తీరాలి." అంది.

"ఆ తల్లిని మాత్రం చంపెయ్యాలనిపించింది."

"అంతకన్నా తెలుగులో కథ చెప్పేవాణ్ణి చంపాలి" అంది 'చే'.

"ఆ తల్లి మన సుందరీబాయి. ఆమె వొక్కత్తే క్రిష్ణాకి ఎదురు తిరిగి బాగా పాడింది" అంది షా.

చే, షా. చెరో కొననించీ ప్రపంచాన్ని చూశే వాళ్ళిద్దరూ, ఏ విషయంలోనూ ఏకాభిప్రాయం లేనివాళ్ళు ఆద్మీ బావుందంటున్నారు.



గుంపులు గుంపులుగా నన్ను ప్రేమించే బెజవాడ ప్రజలు ఆద్మీని చూడ్డానికి వెళుతున్నారని విన్నప్పుడే అనుమానపడుతున్నాను, ఆద్మీ చాలా సాధారణ వ్యవహారమై వుండాలని, గాంధీగారి పాప్యులారిటీకూడా, ఆయన గొప్పతనంలో లోపాన్ని సూచిస్తుందని చాలా యేళ్ళు వాదించిన నేను.

"సాయంత్రం మళ్ళీ వెడతాం. నువ్వూరా" అన్నారు వాళ్ళు. సరే నన్నాను. వెళ్ళలేనని తెలిసికూడా.

అయినా శాంతారాం ఎట్లా మంచి ఫిల్ము తీస్తాడు ?

మర్నాడు సాయింత్రం మైదానంలో నేనూ, మిత్రులూ కలిసి ఆద్మీని చాసాము. దీపావళీ, రుక్మిణీ, నా ప్రెజుడిస్, ఒకవేపూ; సౌరిస్ రామశాస్త్రి ఒకవేపూ పెట్టి.

"కుటుంబరావుగారు ఆద్మీని గురించి వ్రాశారు. చూశారా?" అన్నారు కాటేజ్ ఇన్‌డస్ట్రీస్‌గారు.

"లేదు. వ్రాశారా? మరి ఏ తక్కెడలో వేద్దాం!"

"దీపావళిలో"

వేశాం. వేశినా కదలలేదు ముల్లు.

కుటుంబరావుగారు వ్రాసింది చదవాలనిపించింది. సంగీతం రుచిలో ఎంతో యిద్దరమూ భేదించి, ఒకరి అభిరుచులమీద ఒకరం గౌరవం కల వాళ్ళం. నవ్యసాహిత్య పితామహుల విషయమై అభిప్రాయాలు వెలిబుచ్చడానికి మాటలకోసం భాషలు తిరగేశాం.

* * *

వెల్లటూరుగారు యిసికలో గట్టిగా చతికిలపడి, తాను పూనాలో

శాంతారాం పక్కనకూచుని ఆద్మీని చూశిన కథ చెప్పారు. ఆద్మీ, టెక్నిక్ చాలా గొప్పదనీ, రసం తక్కువఅనీ ఆయన అభిప్రాయం.

★ ★ ★

మూడువారాల కల వాస్తవమయింది. రుక్మిణిగార్నీ రామశాస్త్రి గార్నీ కలిపాను ఒకచోట. కాని పేర్లు తెలియజేస్తే ఆద్మీ క్వెశ్చన్‌మీద హత్యలు జరుగుతాయేమోనని జాగ్రత్తగా వూరుకొన్నాను. ఆద్మీ విషయం పైకి రాకముందే స్నేహితులైన, శ్రీ శ్రీ ఒక్కడే కవి, హృదయమున్న కవి, భవిష్యత్తుకు కవి. తక్కిన .... .... .... .... .... .... వీళ్ళందరూ ఎంత త్వరగా నశిస్తే, అంత సారస్వత కళ్యాణం జరుగుతుందని ఏకగ్రీవంగా యిద్దరూ తీర్మానాలు జరుపుకున్న తర్వాత రామశాస్త్రిగారు బైటకి వెళ్ళినప్పుడు వెళ్ళబెట్టాను.

"ఈయనేనా పదిహేనుసార్లు చూసింది?"

"ఇంకా అయిదుసార్లు-పైన ఈ మధ్య"

రామశాస్త్రిగారు రాగానే కొత్త మనిషిని చూశినట్టు ఎగాదిగా చూశి 'రుక్మిణి' గారు

"ఆద్మీ ఏం బావుంది?" అన్నారు.

మొదట ఆ ప్రశ్నకు తెల్లబోయి...."మీరేనా రుక్మిణీనాథ శాస్త్రి గారు.... ఆ....చాలా బావుంది. నిశ్చయంగా బావుంది. అమోఘంగా బావుంది. శ్రీశ్రీ కవిత్వంమల్లే బావుంది. వెధవ సమాసాల గణగణాలకి పోకండా చూసింది గట్టిగా సూటిగా చెప్పే బలమైన కవిత్వం లాగుంది."

అని రుక్మిణిగారి వాక్కుని శ్రీశ్రీ మంత్రంతో కట్టేశారు. కాని ఆద్మీ విషయంలో ఆ మంత్రానికి కూడా లోబడదలుచుకోలేదు రుక్మిణీనాథ గారు.



చివరకి in Spite of Admi మన స్నేహం అనశ్వరం, అప్రమేయం, అగాధం, అజేయం అని సమ్మతించుకున్నారు.

★ ★ ★

"అన్నట్టు ఆద్మీ చూశావా?" అన్నాను పద్మావతితో.

"చూశాను. బావుంది. ఆ శాంతాహుబ్లికర్‌ని మీరు చూడండి."

'వారూ' నవ్వుతోంది అప్పుడే.

తలెత్తి చూశాను. 'బుచ్చి' గొణుగుతున్నారు.

"మీ రెపుడూ అంతే...." అంటోంది పద్మావతి

"వాడి మొహం పోలీసువాడూ....ఆ సినిమా....ఆపూటింగూ.... నీకే, బావుండాలి."

అన్నమాటలు అక్కడక్కడ వినిపించాయి.

"ఏం వారూ?"

"ఏం బావుండలేదు. అట్లాంటి చెత్తఫిల్ములన్నీ అమ్మకి బావుంటాయి పెదనాన్నా"

నాకు interest పోయింది.

★ ★ ★

బోన్‌గిరిలో ఆద్మీ అనే తురకమాట వినేటప్పటికి "హైదరాబాదు వెడుతున్నారుగా ఆద్మీ అక్కడవుంటే చూడండి" అన్న రామశాస్త్రిగారి మాటలు జ్ఞాపకం వొచ్చాయి. విచిత్రం. నాతోనే ఆ రైల్లోనే దిగింది హైదరాబాదులో ఆద్మీకూడా. ఇక్కడకూడ ఈ ఫిల్ము నన్ను వదలదా? cauli flower మల్లే వెంటనే వొచ్చిందా ? ఎట్లా తప్పించుకోనూ ? ప్రారబ్ధం అనుభవించక తప్పుతుందా ?

ఆదివారందాకా తప్పించుకున్నాను. కర్మదేవతలు జన్మనక్షత్రాలు పరిశీలించి "ఆద్మీ ఫిల్మ అనుభవం తప్పదు." అని ఆకాశంనించి అరిచారు. వొస్తానన్న కృష్ణారావు రాలేదని తప్పించుకోవాలని చూశాను కాని ఆ కర్మదేవతలు జ్వరంతో పడుకున్న బాబుకి ఉష్ణం తగ్గించి 'నేను వొస్తాలే, పోనీ' అనిపించారు దోవలో "పోనీ.... ఆ Dorothy Lamor Picture కి పోదాము అన్నాను కొన ప్రాణంతో.

"సరే నన్నాడు బాబు"

అమ్మా! తప్పించుకున్నాను.

ఎదురుగా వొస్తున్నాడు మధురమూర్తి కృష్ణారావు. ఆద్మీ నాకు చూపించి శాంతారాంని తిట్టించకపోతే ఇంక టీ తాగనని శపథం పట్టిన కృష్ణారావు.

"టిక్కెట్లు దొరక" వన్నారు. మదమతో అదిలించాను నా వాహనాన్ని వెనక్కి తిరగమని. అని నా Olb horse కాదని మరిచిపోయి అర్థంకాక సినిమా వరండాలోకి దూకింది ఆ వృద్ధ సైకిలురాజము.

"వెనక్కి పోదాం"

లాభంలేదు. ఖరీదైన టిక్కెట్లు దొరికించుకుంటున్నాడు కృష్ణారావు. వెళ్ళాం. సీట్లు మూడు వొరసగా దొరకలేదు. వెళ్ళిపోదామన్నాను కాని ఎంతపట్టుదల లేకపోతే నాముందు హైదరాబాదు పోయిన సోదర కవుల ప్రేమాస్పదమైన నా మీది అపవాదులతో మనస్సు విరగక ఇంకా నన్ను ప్రేమిస్తున్నాడు కృష్ణారావు? వొస్తానని వెళ్ళి కొత్త టిక్కెట్లతో ఇంకో మెట్టు ఎక్కించారు.

కాళ్ళసందడితో ఫిల్మ ప్రారంభమై అమెరికన్ ఫిల్ముల టెక్నిక్ని మా మొహాన కొట్టింది. కప్పదొంతరల కామిక్ చూసి. 'ఇదీరకం' అని జయధ్వానం చేశాడు కృష్ణారావు.

పెదిమల్లోంచి సన్నగా నవ్వాడు బాబు.



"ఛీ, ఛీ," అన్నాను నేను.

శాంతా హుబ్లికర్ని దగ్గరగా తెచ్చాడు డైరెక్టరు. మళ్ళీ ఆ సినిమా తీసే సీనువరకూ నేను హాల్లో కూర్చుని ఫిల్మ చూస్తున్నానని మరచిపోయినాను. ఇంటర్వల్ లోకూడా ఆ తెరవంకే చూస్తున్నాను ఆమె యిందాక కనపడ్డస్థలమని. నా పక్క బాబూ కృష్ణారావు చీదరించుకొంటున్నారు. కథని, మనుషుల్ని, శాంతారాంని తిడుతున్నారు. కాని, కథ ఏమైతేనేం, టెక్నిక్ ఏమైతేనేం, Film ఏమైతేనేం? శాంతాహుబ్లికర్ని నాముందు అంతసేపు నుంచోపెట్టిన శాంతారాంని ఎట్లా తిట్టను? దేవుడు చెయ్యని పని చెయ్యగలిగాడు శాంతారాం. నా సంగతి తెలుసునేమో, హుబ్లికర్ లేకండా పట్టుమని నన్నూ, ఫిల్మనీ, రెండు నిమిషాలు వొంటరిగా వుంచలేదు.

★ ★ ★

ఇంటికి రాగానే సౌరీస్తో చెప్పాను ఆద్మీ చూశానని.

"ఎట్లా వుంది?"

"ఫిల్మ నేను చూడలేదు. హుబ్లికర్నే చూశాను"

"డైరెక్షన్"

"ఆమె గొప్పతనం గొప్పగా తీసుకురావడమే డైరెక్టరు గొప్పతనం. ఇంకేం కావాలి"

"మన మనుకున్న లోపాలో"

★

# సినిమా ప్రియులు

సినిమాలలో నాయకీ నాయకులకు అందమైన వాళ్ళనే ఏరుకుంటారు—అంటే సినిమా చూసేవాళ్లు అందమైనవాళ్లు అనుకునేవాళ్లని. ఆ ప్రియులుకూడా వాళ్ళని మనం అందమైన వాళ్ళు అనుకోవాలనేట్టే వర్తిస్తారు. వాళ్ళ స్వంత అభిప్రాయంలో ఏమీ లోపం వుండదు. కాని ఆ అందమైనా చివరివరకు నిలువదు. ఈ లోపల, డైరెక్టర్ల ఫొటోగ్రాఫర్ల నిర్లక్ష్యంవల్లనో, రహస్య ఆగ్రహంవల్లనో, ఒక్కొక్కప్పుడు చాలా వికృతంకూడా అవుతుంది. లేకపోతే యీప్రియులే విసుగెత్తి నిజస్వరూపాలు ధరిస్తారో? చాలాసార్లు అందవికారం ఏమూలవుందో, ఆ కోణనించే వాళ్ళని మనకి పనిపట్టి ప్రదర్శిస్తున్నట్లు వుంటుంది. అయితే అందం ప్రధానంకాదు సినిమాల్లో అన్న సంగతి చదువుతారు. ఆ చదవడం, ఈ అందాలకి విరోధియై, అప్పుడప్పుడు కారణం లేకండానే అందం లోపించడంలో వ్యక్తమవుతుంది. పూర్వకాలపు కథ అనుకోండి—సత్యభామని యీనాటి స్త్రీలవలె తయారు చేయకూడదు అనే భావం జ్ఞాపకం రావడంవల్ల, జుట్టు, కనపడకండా తలనిండా పూలుచుట్టి, అక్కడక్కడ ఏనాటికీ చెందని వంకర నగలుపెట్టి, వున్న కాస్త అందాన్ని చెడగొడ



తారు. దేవతలు, రాక్షసులు, ఋషులు, మహావీరులు ఇట్లాంటివారికి ప్రత్యేకమైన అంశాలివ్వడానికి ప్రయత్నిస్తారు. ఏ అందమైనా, సినిమాలో దానికి రెండు గుణాలు వుండాలి. ఇది అందమూ అని, అందమంటే అస లేమీ ఎన్నడూ కలలోనైనా నిర్ణయంలేని మనుషులు ఒప్పుకోవాలి ఆ ఒప్పుకునేవాళ్ళు ఆ అందాన్ని అనుకరించడానికి అభిలషించాలి. వాళ్ళకి ఆ అనుకరణ సాధ్యమయ్యే స్థితిలో వుండాలి. ఆ అలంకారం చేసుకుంటే తాము అంతటి గ్లామర్ తెచ్చుకోగలమని అభిప్రాయం కలగాలి.

సినిమా ప్రియులు ఎప్పుడూ చాలా నీతిపరులు, శీలవంతులు, తప్పిజారికూడా ఒక్క నీచమైన కార్యం చెయ్యరు. ఒకవేళ చేసినా, మననించి సంపూర్ణమైన సానుభూతి పొందుతూనే చేస్తారు. అంటే చూసేవాళ్ళ **Moral standards** కి అందాలి వాళ్ళపనులు. అంతకన్న ఉన్నతమైతే వాళ్ళు అర్థంకారు ప్రేక్షకులకి. చాలా ఉదారమైన, నీతివంతాలైన వాక్యాలే మాట్లాడతారు, పాడతారు. అంటే చిన్నప్పుడు కాపీబుక్కుల్లో నేర్చుకున్న నీతివాక్యాలన్నమాట. వీళ్ళకి సాధారణంగావున్న నీతులన్నీ మామూలుగా మృగాలకి కూడా వుంటాయి. తల్లిప్రేమ, ఆడదాన్ని అనుభవించాలనే పట్టూ, విరోధులతో కలబడే శూరత్వం, ఇట్లాంటివి. కాకపోతే అడివి మనుషుల్లోకూడా వుండే సంఘభక్తి, దైవభీతి మొదలైనవి. కాని మెదడుతో ఆలోచన చాలా తక్కువ. ఎందుకంటే వీరి సృష్టికర్తలకి నీతీ, నడవడీ, తెలివీ, వీటి విషయం చాలా తక్కువ తెలుసు గనక, తెలుసుకోడానికి వ్యవధి వుండదు. ఉన్నంతవరకైనా ప్రదర్శించే ధైర్యం వుండదు.

నాయకుడి పని శూరకార్యాలు చెయ్యడం, ప్రేమించడం. నాయకి పని అతనికోసం విరహపడడం, ఎట్లాగో ఓలాగు పాతివ్రత్యమనే పేర, తన అందాలు చల్లి, పెళ్ళి ఉచ్చులో బిగించాలని చూడడం. హీరో చాలా

బలిష్ఠుడు, నేర్పరి, యుద్ధప్రవీణుడు. గుర్రాలు, సైకిళ్ళు, కొండలు, కుస్తీలు చాలా సునాయాసం అతనికి. ఎన్నడూ, ఎన్ని దెబ్బలు తినినా, ఎంతరక్తం కారినా, ఇతని బలం ఏ మాత్రమూ తగ్గదు. అతనికి ఎన్నడూ జబ్బుచెయ్యదు- నాయకి సానుభూతిపొందే క్లయిమాక్సులో తప్ప అప్పుడు చచ్చిపోతాడేమోనని అనిపించేటంత, మనకి కాదు (మనకు తెలుసు బతుకుతాడని) ఆమెకి చచ్చిపోతాడేమో ననిపించేటంత జబ్బుచేస్తుంది. సాధారణ మానవులకి చేసే చిన్న చిన్న జబ్బులు అతనికి చెయ్యనే చెయ్యవు. ఒక్క హీరో కూడా ఇంతవరకు ఏ చిత్రంలోనూ చీదలేదు, ముక్కు తుడుచుకోలేదు. హీరో తండ్రిమాత్రం, దగ్గి దగ్గి చస్తాడు. అరణ్యంలోనో, మహాసముద్రం మధ్యలోనో, తిండిలేక గడిపినా సరే, అతని ముందు ఎవరూ ఆగలేరు. ఒక్క మనిషి ఏ ఆయాసమూ ప్రత్యేకమైన నేర్పూలేకండానే పది నిమిషాల్లో వెయ్యిమందిని చంపేస్తాడు. అతని కోపాన్ని చూస్తే చాలు పడిపోతూవుంటారు విరోధులు. ఈ హీరోలకి చాలా ఆపదలువొచ్చి తీరతాయి యుద్ధాలు, భూకంపాలు, శత్రువులు, అడివిమృగాలు-చాలావరకు అవి నాయకిమూలానే కలుగుతాయి. కాని, అందరికి తెలుసు యీ నాయకులు చిరంజీవులని, అశ్వత్థామకీ, మార్కండేయుడికీ, మృత్యుంజయుడికీ, ఐనా చావువుంది కాని, వీళ్ళకిలేదు. అపాయాల్లోంచి యీ ప్రహ్లాదులు నారాయణ మంత్రోచ్చారణ లేకండానే దాటుకొస్తారు నవ్వుతో. "చూశారా!" అని సర్కసువాళ్ళ మల్లే మన ముందే చేతులు దులుపుకుని, జబ్బలుచరిచి, నవ్వుతారు మనమొహాన. మామూలు మనుష్యదేహాలుగల మనం వాళ్ళనిచూసి చాలా యీర్ష్య పడేట్టు చేస్తారు. కొందరు ఈలలుకూడా వేస్తారు. యెంత గాయమైనా, తాటి ఎత్తునించి కిందపడ్డా, 'అబ్బా' అన్నా అనరు. ఒక్క నిమిషం అట్లా పడికూడా వుండరు. మెల్లిగా చేతులమీద ఆనుకుని అన్నా లేవరు. చువ్వల్లాగు చప్పున నుంచుంటారు. వెంటనే ఓ



దూకుదూకి పరిగెత్తుతారు. ఇరవైమైళ్ళ వేగంతో పరిగెత్తే గుర్రంమీద పడతారు, చచ్చేట్టు కిందపడి. (ఇంక నెలరోజులు లేవలేరనుకుంటాం) కాని చిరునవ్వుతో పాడుతో లేస్తారు పైగా. నిప్పుకాల్చదు, కత్తి నరకదు, నీళ్ళు ముంచవు వీళ్ళని. ఇరవైయేళ్ళు గడుస్తాయి ఫిల్ములో. మొహంమీద ముడతపడదు, వెంట్రుక తెల్లబడదు.

ఈ నాయకులు చాలా ధనవంతులు—లేక కటిక దరిద్రులు—కాక ధనవంతులు కటిక దరిద్రులవుతారు. కటిక దరిద్రులు అమిత ధనవంతులవుతారు. మధ్యమ జాతకం పట్టదు, ఎన్నటికీకూడా. ఫిల్ము ఆఖరయ్యేప్పుడు సుఖభోగాలతో తులతూగుతుంటారు. కష్టాలు గలుగుతాయిగాని, అన్నీ పీడిపోయి తిరుగుతాయి.

భక్తిహీరోలు యిప్పుడు ప్రాబల్యంలోకి వస్తున్నారు. వీళ్ళు పాడడం, గెంతడంతప్ప ఇంకే సాహసకార్యాలూ చెయ్యరు. ఒక్క చిక్కి ఐనా వుంటారు; చాలా లావుగానన్నా వుంటారు. నిరాహారులైకూడా మనం చూస్తోవుండగా పూరతారు. వీళ్ళకి భార్య తప్ప పరస్త్రీ వుండదు. వీళ్ళ గడ్డాలూ, బోడిగుళ్ళూ, పిచ్చిపోకిళ్ళూ, భక్తి చూసి ఏ స్త్రీ వీళ్ళ దగ్గర చేరదు. ఆ వేరుగతి లేని భార్యని, భార్యకదా అని వీళ్ళు భక్తి పేర పెట్టే తిప్పలుకాక, మనకి కనపడకండా....

చోటా నాయకులు విలన్లు. వీళ్ళకి లేని దుర్గుణాలుగాని, వీళ్ళు చెయ్యలేని ఘోరాలుకాని ఆలోచించుకోడం కష్టం. మేము చాలా దుర్మార్గులం, అని గట్టిగా చెప్పుకుంటునట్టు తెరమీదికి వొస్తారు. కొందరు అనాగరికులు, కొందరు సూటూ, కంటికి ఒంటి అద్దం తగిలించుకు తయారవుతారు. వీళ్ళ ముఖ్యం కర్తవ్యం నాయకుని తిప్పలు పెట్టడమూ, నాయకుడూ నాయికా కలుసుకోకుండా చూసి, ఫిల్మును పొడిగించడమూ-

ఆ పనికోసం కథ మొదటినించి, కథ చివరవరకూ నాయకివంక కోర చూపులు పక్కగా చూస్తోవుంటారు. చాలాసార్లు అనిపిస్తుంది ఆ నాయకకి ఎంత బుద్ధిలేదా, ఆ సుగుణాల చలివిడి ముద్ద నాయకుడికన్న, యీవిలనే ఏ స్త్రీ కైనా ఎంత ఆకర్షణంగా వుండగలడా అని. ఈ విలన్‌కి కూడా కత్తిసామూ, గుర్రపుస్వారీ అన్నీ బాగా చేతనవును. హీరోకన్నా కూడా ప్రవీణుడు. కాని కథకుడూ, విధీ, ఇద్దరూ కుట్రచేసి ఇతన్ని ఎప్పుడూ అపజయంలోకి నెడతారు. చివరికి విసుగెత్తి ఈ విలన్ చచ్చి అన్నా పోతాడు, కాకపోతే బైరాగుల్లో నన్నా కలిసిపోతాడు. మొత్తానికి యీ విలన్ లేకపోతే, హీరోని భరించడం చాలా కష్టం.

ఈ హీరోలు గొప్ప పాటకులై తీరతారు. గొప్ప మహారాజుకూడా సమయం చిక్కినప్పుడల్లా అరుస్తాడు పాట ధోరణిలో. వీళ్ళకి ఆడవాళ్ళని చూడగానే పాట వొస్తుంది. మొదట్లో, కొత్త ప్రియురాలితో కలిసి, ప్రేమా, అగ్నీ, జ్యోతి, కోవెలా, భ్రమరమూ, పువ్వులూ, ఆకాశమూ ఈ మాటలతో డ్యూయెట్లు పాడతారు. మనకి, ప్రియురాలికీ స్పష్టంగా కన పడేవి, వినపడేవి గుడ్డివారికీ, చెమిటివారికీ చెప్పినట్లు జాబితా ఏకరవు పెడతారు పాటలో. కోవెల అరిచి తీరుతుంది. గాలివీస్తుంది. పువ్వులు విచ్చుకుంటాయి. మంచి పట్టు సమయంలో ఒక్క తుఫాను వస్తుంది. కథా నాయిక దాంట్లో చిక్కుకు తీరుతుంది. తుపాను వస్తుందనగా ఆమె ఎప్పుడూ ఇంట్లో నిలవదు. అంతవరకు ఎన్నడూ వూరుదాటని ఆమె చప్పున అడివిలో సరాసరి బురదలోకీ, ముళ్ళలోకి పోయి, దిక్కులేదనీ, రక్షించమనీ పాట పాడుతుంది.

యీ పాటలెప్పుడూ హిందీ రికార్డులకి మచ్చుగా వుంటాయి. అందరూ ఒకటేరకం పాటలు. శ్రీరాముడూ, నవీన చిత్రకారుడూ, తాని



ల్దాలూ, రిక్షావాడూ, అందరూ ఒకటే రకం ధోరణిలో-రాగంలో పాటలు ఫిల్ములో పాడారా బాగా పాడతారు, అపస్వరాలు లేకండా. ప్రేమను గురించో, జీవిత సుఖదుఃఖాలో, భక్తో, ఇవే పాటలు. కాకపోతే బావ వొస్తాడనో, చెప్పులు కొంటారా అనో ఒకటే గిర్రున తిరుగుతో అరుస్తారు. చూసినవాళ్ళు వీళ్ళకి మతివుందని ఎందుకు అనుకుంటారో తెలీదు.

ఈ హీరోలు ఎంత దరిద్రులైనా సరే వీరే పది రకాల వాయిద్యా లతో ఒక ఆర్కెష్ట్రా వీరి ఆధీనంలో వుంటుంది. ఆ ఆర్కెష్ట్రా వాళ్ళు ఇంక వీళ్ళని ఓ నిమిషం వొదలరు. ఎప్పుడు పాడతారో అని స్రుతి పెట్టు కుని సిద్ధంగా వీరి వెంటనే తిరుగుతో వుంటారు. అర్ధరాత్రులైనా సరే, నది వొడ్డమీద, సముద్రాలమధ్యా, తుపానులలో కూడా మోగిస్తారు వాయి ద్యాలని. సొంతంగా కూడా ఘోషిస్తారు సంతోష సమయాల్లో, కష్ట పరి స్థితుల్లో. ఆమె పళ్లెం పడేస్తే వాళ్ళు వెనక 'ఢమ ఢమ' మంటారు. ఆమె నడుస్తోవుంటే ప్రతి అడుగుకీ, అయిష్టం తెలుపుతో, అపాయంవుందని తెలియచేస్తో 'మూ, మూ, మూ,' అని మూలుగుతారు. ఇద్దరు కొట్టు కుంటో వుంటే వీళ్ళ ఉత్సాహానికి మేరలేదు. అన్ని వాయిద్యాలలో వీళ్ళు గంతులేస్తారు. అతి రహస్యంగా ప్రియులు కలుసుకున్న సంకేత స్తలాల్లో అర్ధరాత్రి కూడా డ్యూయెట్ పాడబోతున్నారని తెలిసి వీళ్లు దూరతారు చెట్ల సందుల్లో. పక్కన యింట్లో మనుషులున్నారు. వింటే కొంప మునుగుతుందని తెలిసి కూడా Whispers మాట్లాడుతూ, డ్యూయెట్ మాత్రం మూడు మైళ్లు వినపడేట్టు అరుస్తూ పాడతారు, ప్రియులం కలుసు కున్నామనీ, తమకు ప్రేమ అనీ, పొరుగూళ్ళకి వినిపించేట్టు. వెంటనే ఆర్కెష్ట్రావారు అందుకుంటారు; కాని యీ ఆర్కెష్ట్రావారు సూర్య చంద్రులవలె తటస్థ సాక్షులు. ఎంత అపాయంలో వున్నా అపాయ

శబ్దాలు చేస్తారుగాని, సహాయం మాత్రం చెయ్యరు. స్త్రీకి బలాత్కారం జరుగుతో వుంటే ఆ చివర నిమిషాన కూడా పూత్తారుగాని, బైటపడరు. మనకి తెలిసినట్టే వాళ్ళకీ తెలుసు ఆ హద్దుదాటి ఏమీ జరగకుండా సెన్సారు ఒప్పుకునే టంతవరకు అన్నీ జరిగేటట్లుగా చూస్తో ఆమెని రక్షించడానికై సరైన నిమిషం కోసం హీరో కాచుకుని వున్నాడని.

ఈ హీరోల్లో పెళ్ళికాని వాళ్ళు తక్కువ. వాళ్ళు ఒక యువతిని చూచి ప్రేమిస్తారు. అయితే పెళ్ళి చేసుకోడానికి అన్నీ అభ్యంతరాలే. అభ్యంతరాలు అన్నీ వుండడం చూచుకొనే, వీళ్ళు నాయకులౌతారు. ఈ ఫిల్ములు చూస్తే అసలు ఇన్ని పెళ్ళిళ్ళు లోకంలో ఎట్లా జరుగుతున్నాయా అని సందేహం కలుగుతుంది. కులం, ధనం, విరోధులు తలిదండ్రులు, ఇతర స్త్రీలు, పురుషులూ, ప్రతీదీ విరోధమే. చెట్టూ, పుట్టా, దేవుడూ, వీళ్ళిద్దరూ తప్ప వీళ్ళ పెళ్ళిని అంగీకరించే చరాచరం వొక్కటీ వుండదు, ఇంత విశాల ప్రపంచంలో.

కాని, చాలామంది నాయకులకు పెళ్ళి అయివుంటుంది. పెళ్ళి అయిందా, ఆ భార్యని ప్రేమించరు. ప్రేమించడానికి వీల్లేదు, పర స్త్రీనే ప్రేమిస్తారు. కాని వీరు ప్రేమించిన స్త్రీ ఒక విలన్, దుర్మార్గురాలు, వంచకురాలు ఐ తీరుతుంది. ఇంత తెలివీ, బుద్ధిగల మనవాడు ఎందుకు అట్లాంటి స్త్రీనే ఏరుకుంటాడో ఎవరికీ తెలీదు. అట్లాంటి ద్రోహానికి, నీచ బుద్ధికి, బుద్ధిలేనితనానికి ఎవరూ ఏమీ అనరు అతన్ని. భార్య అసలేమీ అనదు. మొత్తానికి తప్పు అతనిదనిపించదు, ఆ వొయ్యారిదేగాని. ఆ స్త్రీలో ఒక్క సుగుణమైనా కనిపించదు. ఆమె తెరమీదకు రాగానే చెపుతుంది ఆమె మొహ లక్షణం తాను తేలిక మనిషిననీ. కపటురాలుననీ ఒక్క హీరోకే తెలీదు ఆ సంగతి – ప్రతి నిమిషం ఆమె వెనకే తిరిగే



హీరోకి. ఆమెకి ప్రేమ ఏ కోశాన వుండదు. అసలు అదదే కాదు. ప్రేమ సంగతి పాడుతుంది. చాల త్వరలో అతని డబ్బు అంతా కాజేస్తుంది. తెలివైనదే కాని, తెలివిని దుష్టత్వాని కుపయోగిస్తుంది. తప్పిజారి ఒక్కరూ నిజమున్న మనుషులు వుండరు వీళ్ళల్లో. సుగుణాలన్నీ భార్యలవి. దుర్గుణాలన్నీ ఈ స్త్రీలవి. ఇట్లా స్పష్ట విభాగం ఏర్పడి పోయింది. వీళ్ళ షోకులూ, వీళ్ళ వేషాలూ, చూపులూ, చూసినంత మాత్రాన ఎవరికైనా తెలుస్తుంది వీళ్ళు కులటలని- అన్ని సుగుణాలూ, వివేకంవున్న హీరోకి తప్ప. అతని కళ్ళఎదుట, జరిగే మోసాన్ని కూడా చూడడు, తక్కిన వ్యవహారాల్లో చాలా జాగ్రత్త కలవాడే మళ్ళీ

ఇట్లా కొన్నాళ్ళు, ఆమె వెంట తిరిగి డబ్బంతా ఇచ్చి, వాగ్దత్తాలు చేసి, బికారి అవుతాడు. తాగుతాడు. మరీ బికారి అవుతాడు. ఆరోగ్యం పోతుంది. పోసీ, తెలివిగా భార్యనీ ఈమెనీ కూడా చూచుకునే జ్ఞానం ఏ ఒక్క హీరోకి వుండదు. తెలుసుకుంటాడు ఈ స్త్రీలోని మోసం, ఇంక మోసపోవడానికి ఏమీ లేనపుడు. ఇంకా తెలుసుకోకపోతే చివరికి ఆమె చెపుతుంది. పోతుంది. వెంటనే యిన్నాళ్ళు వొదిలేసిన భార్య దగ్గిరకొచ్చి రెండు మూడు పాటల్లో క్షమార్పణ కోరుకుంటాడు. మళ్ళీ భార్యాభర్తలు కలిసి డ్యూయెట్ పాడతారు. ఓ పిల్లవుంటే కీచుగొంతుకతో అదీ కలుస్తుంది, ఈ పాటకూనిలో.

భార్యలు సాధారణంగా కథానాయికలు కారు. వాళ్ళు తెరమీద ప్రవేశించడమే ఏడుస్తో ప్రవేశిస్తారు. సంతోషంగా వున్నారా, ఆపద త్వరగా రాక తప్పదు. వీళ్ళు అందమైన వాళ్ళే. కాని ఆ మనుషులు

వొప్పుకున్నంతవరకు కొంత పూర్వోత్తర రకంగా వుంచుతారు యీ పాత్రల్ని. వీళ్ళల్లో ఒక్కరైనా పొరబాటునైనా పర పురుషుణ్ణి కన్నెత్తి చూడరు. అప్పుడప్పుడు పరపురుషులుమాత్రం వాళ్ళ దేహాల్నో, హృదయాల్నో అపహరించాలని చూస్తారు. కాని అట్లాంటిదుర్మార్గులకి తప్పకండా శాస్తి జరిగితీరుతుంది. ఈ పతివ్రతలు ఆ నీచుల్ని, అన్నా, నాన్నా, తమ్ముడూ అని వాళ్ళకి బుద్ధితెప్పిస్తారు. ఆ పిలుపుతో ఎంతరౌడీ కూడా నీతిపరుడై పోతాడు. వీళ్ళల్లో కొందరు, అట్లా పిలవడం మరిచి పోయి, గొప్ప వీరకృత్యాలుచేసి తప్పించుకుంటారు. భర్తలు వీళ్ళని వొదలడమే కాదు, బాగా హింసిస్తారు. వీళ్ళు భర్తల కాళ్ళావేళ్ళాపడి విసికించి, హింసింపించుకుంటారు? భర్త ఏంచేసినాసరే వీళ్ళకి కోపమన్నమాటరాదు. అతను హింసించినకొద్దీ నాథా, ప్రాణనాథా, పంచప్రాణనాథా, జీవితేశ్వరా, అని ప్రాధేయపడతారు. ఈరకం స్త్రీలని భర్త తంతోవుంటే ప్రేక్షకుల సానుభూతి భర్త పక్షమే ఉంటుంది.

భర్త ఎప్పుడు కష్టపెడతాడా, ఎప్పుడు తన సహనాన్ని ప్రదర్శిద్దామా, ఎప్పుడు ఏడుపుపాట పాడడానికి సమయం చిక్కుతుందా అని కాచుకుని వున్నట్టుంటాయి వీళ్ళమొహాలు. ఈమె పిల్లలు కూడా ఎన్నడూ అల్లరి చెయ్యక తల్లితోబాటు తండ్రి హింసలకి ఎదురు చూస్తో, తల్లితో కలిసి ఏడుస్తో వుంటారు. తండ్రిని ఎన్నడూ తిట్టరు. ఈ భార్యలకి దైవభక్తి అమితం. పూజలు, నోములు, వ్రతాలతోటి నిండి పోతుంది బతుకు. విధినీ, దేవుణ్ని పాటల్లో తిడతారు. కొంచెం కులాసాకి పుట్టింటికైనా పోరు. వీళ్ళరొదతో, ఈర్ష్యలతో, రోదనలతో భర్త బతుకు ఘోరం చెయ్యాలనే కసితో, కాచుకు కూచుంటారు, ఆ మొగాడు ఎప్పుడు ఇల్లు చేరుకుంటాడా, పనిపట్టిద్దామా అని పీనిగల్లాగు వేళ్ళాడుతో. ఏ కోశానా అభిమానం, రోషం, బుద్ధి కనపడవు వీళ్ళల్లో. అతను గుమ్మంలో



కాలుపెట్టడంతోటే, మళ్ళీ వెళ్ళిందాకా పిశాచాల్లాగు పట్టుకు వేళ్ళాడి నీచంగా ఏడుస్తారు.

ఆ కొత్త స్త్రీని విడిచాక భర్త ఇంకోస్త్రీదగ్గిరికిపోడు. జన్మకి అతనికి బుద్ధి వస్తుంది. పోనీ ఈ సారి తెలివిగా ఇంకో స్త్రీని పట్టాలని చూడడు. సరాసరి ఈ భార్య పాదాల మీద వాలతాడు. అక్కడితో కథ ఆఖరవుతుంది. కాని ఈ ఇద్దరూ ఇంట్లో మళ్ళీ ఎట్లా కాపరం చెయ్యగలిగారు. వీళ్ళకి మామూలు మనుషులకి వుండే రక్తమాంసాలున్నాయా అని ఆశ్చర్యం. భర్తచేత ఇన్ని తన్నులు తిని, ఏడ్చి, అవమానాన్నిపొంది. ఆ మహాయిల్లాలు, ఏమీ సంకోచమూ, సిగ్గూ లేకుండా, అతన్ని కావిలించుకుని, ఎగిరి ఎగిరి డ్యూయెట్ పాడుతుంది, ఎంతలావుపాటిదీ, వయస్సు మళ్ళిందీ ఐనాసరే.

ఆ భర్త ప్రవర్తన చూసిన ఏ బుద్ధిహీనురాలికైనా తోస్తుంది-అతను చేసిన ఘోరకృత్యాల తరవాత ఎన్నటికీ ఆ మనిషిని నమ్మడానికి వీలు లేదని-ఒక్క యీ పతివ్రతకి తప్ప. ఈ భార్యని భర్త వొదలిన రోజుల్లో ఆమెని ఆదరించే బంధువుగాని, స్నేహితులుగాని వుండరు. మనం చూస్తో వుండగా తండ్రి అరగంటసేపు తన్నుకుని ఎగశ్వాస పీలుస్తో చస్తాడు. అన్నదమ్ములు అసలు కనపడరు. పిల్లలు చిన్న వాళ్లు. మొత్తానికి ఏ దిక్కూ కనబడదు.

ఈ ఫిల్ముల్లో మంచి ఎన్నడూ విజయం పొందుతుంది. మంచి

అంటే కథానాయకుడూ నాయికా అన్నమాట చెడ్డ నశిస్తుంది లేక పశ్చాత్తాప పడుతుంది, లేక చస్తుంది. కాకపోతే సన్యాసం తీసుకుని తత్వాలు పాడుతుంది. కాని లోకంలో జరిగేట్టు మంచివాళ్ళు, బీదరికంలో, కష్టంలో నిలిచిపోరు. ఈ దుర్మార్గురాళ్ళయిన స్త్రీలు అట్లాగే ఇంకో మొగాడికోసం పన్నాగం వేస్తో వుండిపోరు. అన్నీ చక్కగా తీర్చినట్టు సర్దుకుపోతాయి. పోతాయని ముందే తెలుసు మనకి.

ఎందుకు ప్రియురాలు ఎప్పుడూ దుర్మార్గురాలో, ఎందుకు ఆమెని యీ హీరో అంత వెంటబడి ప్రేమిస్తాడో, అట్లా ప్రేమించడానికి అతనెంత నీచుడో, అట్లాంటివాణ్ణి ఎందుకు ఆ భార్య తిరిగి స్వీకరిస్తుందో, స్వీకరించడంవల్ల ఎంత నీచురాలవుతుందో ఇవి ఎవరూ ఆలోచించరు.

ఈ కథానాయికల్లో కొంత మంది వితంతువులు వుంటారు. నాయకుడికి వీళ్ళమీద ప్రేమరావడానికి కారణం వాళ్ళు వితంతువులు కావడం తప్ప యింకేం కారణం కనిపించదు. అకస్మాత్తుగా వితంతువుల బాధల మీద అమితమైన జాలికలిగి పాటపాడతాడు. ఆమెతో నిన్ను పెళ్ళిచేసుకోవాలని వుందనీ అనడు. పసుపు కుంకుమ నీ జన్మహక్కు కాదా అని పాడతాడు. ఆ జన్మ హక్కుని ఇంకోడితో తీర్చుకుంటానంటే ఒప్పుకోడు. ఆ హక్కు అతని జేబులో పెట్టుకుని తిరుగుతున్నట్టు ఫీలవుతుంది, ఆ వితంతువుకూడా, ఆ హక్కు యింకో మగవాడిదగ్గర వుండనట్టే. వెంటనే ఓ కుంకం భరిణ సంపాదించి ఆమె వెంటపడతాడు. ఆ కుంకం భరిణని చూసి, తనకు గర్భం కలుగుతున్నంత భయంతో పరిగెత్తుతుం దీమె. ఏం



చేసినా ఒప్పుకుంటుందిగాని, ఆమె ఆ కుంకం మొహాన పెట్టించుకోడానికి ఒప్పుకోదు.

ప్రస్తుతం పరాయి ప్రియురాళ్ళు దేవతాస్త్రీ లవుతున్నారు. వీళ్ళని దేవత లని చూపించడానికి ఫిల్ము వాళ్ళు పడే శ్రమచూస్తే చాలా జాలి వేస్తుంది. యే వికృతమో చేసి వాళ్ళని దేవతా స్త్రీలంటే పనికిరాదుమరి. వాళ్ళకి ఆకర్షణ ఉండాలి. పురాణంలో ఏవీ ఆధారాలు దొరకలేదు. కనక స్వంత కల్పనతో పాశ్చాత్య దేవతలు చేద్దామనుకున్నారు. రెక్కలు పెట్టీ, గౌన్లు తొడిగీ, మొహాన బాగా సుద్దపట్టించీ, నెత్తిమీద ఆకుల చక్రాలు పెట్టీ, గట్టిజంపర్లు తొడిగీ, చాలా జాలివేస్తుంది-వీళ్ళు దినదినమూ, ఆ తయారుకి ఎట్లాఒప్పుకున్నారా అని. వీళ్ళని సరిగా నుంచోనీరు, కూర్చోనీరు. సన్నకొండ శిఖరాలూ, మబ్బులూ, గాలీ, చెరువులూ, ఆకాశం, వీటిల్లో నుంచోపెడతారు, తేలిస్తారు. వీళ్ళని చూస్తే మద్రాసులో నల్లటి యూరేషియన్ ముసలమ్మలు ఎవరో యిచ్చిన పాతగౌన్లు వేసుకొని, చిరిగిన షూలతో ఇంగ్లీషులో అడుక్కుంటారూ-వాళ్ళు జ్ఞాపకం ఒస్తారు.

మచ్చుకి వీళ్ళ వెకిలివేషాలూ, చొంగలూ, పాటలూ చూస్తే ఏడుపు ఒస్తుంది, 'మానవుడా! నీ స్వర్గం ఇదా!' అని.

ఫిల్ములో ప్రేమ చాలా అకస్మాత్తుగా వస్తుంది- విపరీతంగా భూకంపం వలె. ప్రేమ కలగాలనే నాయిక ఏదో భయోత్పాతమైన కార్యం చేస్తుంది. ఒకటి, గిర్రున తిరిగి పాట పాడుతుంది. రెండు వుయ్యాల

పూగుతుంది. మూడు అభినయం పడుతుంది. ఆమెవెంట ఆరెస్ట్రా ఒకటే 'కుయ్ కుయ్' మంటుంది-చిత్తకార్తి కుక్కని సూచిస్తో. కెమేరాకి పిచ్చెక్కి ఆమెవెంట గిరగిరా పల్టీలు కొడుతుంది. చెట్లూ, భూమి, స్తంభాలు, గిర్రున తిరిగిపోతాయి మనకళ్ళముందు. ఈ గెంతే నాయికకి ముప్పైఏళ్ళకి తక్కువ వుండవని మనకి కెమెరా చెపుతూనే వుంటుంది. కాని ఆమె తనకి పదహారేళ్ళని నమ్మమని గోలచేస్తుంది. మూరాంపట్టి 'నమ్మరా కావలిస్తే, చూడండి' అని పావడఎత్తి గిర్రున తిరుగుతుంది. పొదల్లో దూరుతుంది. మేడమెట్లు నాలుగేసి ఒక్కసారి దూకుతుంది.

ఇంత చేసినా ఆమెకి తనకి కలిగింది ప్రేమ అని ఆమెకే నమ్మకం వుండదు గావును ! మనం నమ్మలేదని అనుమానమో ఏమో ! ప్రేమవొచ్చిన వాళ్ళు ఏం చేస్తారో సినిమా మనుషులకి తెలీక అయి వుండవచ్చు. ఈ నాయికా నాయకులు 'మాకు ప్రేమవొచ్చిందో' అని అరుస్తారు, పెద్దరోగం పుట్టినట్టు. 'అవును నమ్మండి. మాకుకూడా తెలుసు' అని బాకావాళ్ళు అరుస్తారు వెనకనించి పువ్వులు. పక్షులు, వాయువు, ఆకాశం, అన్నీ "అమ్మో, అమ్మో, ఎంతప్రేమవొచ్చింది వీళ్ళకి. ఏం చెయ్యం ! ఏ చెయ్యం" అంటాయి. ప్రేమవచ్చిన మనుషులమధ్యవుండే నిశ్శబ్దంగాని, మామూలు సంభాషణగాని వీళ్ళకిరావు. కోవెలలూ, కాంతులూ, జ్యోతులూ, స్వర్గాలూ, పుణ్యాలూ, వీటిసంగతే సంభాషణ. ఈ ప్రియులు ఎక్కడ కలుసుకోనీ, చీకటి గుడిసెలోనైనా సరే, అర్ధరాత్రి అరణ్యంలో నైనాసరే మీద పెద్ద వెలుగు పడుతోనే వుంటుంది. వెనక బాజాలగోల వినపడుతోనే వుంటుంది.



ఏ ప్రియులైనా ప్రేమ డ్యూయెట్ పాడితీరతారు.

ఇది ప్రేమలాగుందంటాడు ఆకాశం కేసి చూస్తో.

అవును, అలాగే వుందంటారు ఇద్దరు బాకా వాళ్ళు.

అట్లాగే కనపడుతోందంటుంది, చెట్టు కొమ్మమీద చెయ్యేసి.

రెండుపువ్వులు పూగుతాయి.

కనపడుతోందని సన్నపీకవాడు వుయ్‌మంటాడు.

అయితే, ఇది ప్రేమే అంటాడు హీరో, ఆ పక్కకి వొరిగి.

నలుగురు బొయ్‌బొయ్ మంటారు వెనక.

ఆ కూసే కోవెలని చూడు అంటుంది ఆమె, ఒక్క గంతేసి.

రెండు పావురాలు ముక్కులతో పాడుకుంటాయి.

కోవెలలాగు కూస్తారు ఇద్దరు తూతూలవారు.

